# సమాలోచన




జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-5-1980 సంచిక 13


## —* ఈ సంచికలో *—



16_5_1980 సంచికలో కళాపూర్ణోదయం కల్పనావైచిత్రి, పుష్పప్రమోదము - ప్రయోజనాత్మకత, చేమకూర సారంగ ధరచరిత్ర, చరిత్రలో పారశీక సాహిత్యము - ఉమర్ ఖయ్యాం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు 10_00.

అర్ధసంవత్సరమునకు రు 5_50.

విడిప్రతి 50 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

పుటము ౪ | రాజమహేంద్రవరము 1-5-1980 | సంచిక 13


## పురుషార్థ సుధానిధి

### ధర్మస్కంధము – ద్వాదశాధ్యాయము

### పితృతీర్థ కథనము

మూలం : శ్రీ సాయణాచార్యులు.

పరమరహస్యమైనదియు విష్ణుమూర్తిచేతనే దెలుపబడినదియు నగు పితృతీర్థ మహిమను సూతుఁడు మునులకు వివరించెను.

మహాపవిత్రమైన కురుక్షేత్రమున 'కుండలుడు' అను పేరుగల బ్రాహ్మణుఁ డుండెను. ఉత్తమ గుణములుగల సుకర్మ యను నాతఁడు కుండలుని పుత్త్రుఁడు. ఆ సుకర్మ జరాపీడితులైన తలిదండ్రులకు సేవ యొనరించినాడు. దానివలన నాతనికి సమస్త సంపదలు ప్రాప్తించినవి.

ఆకాలమున కాశ్యప కులోద్భవుడైన పిప్పలుఁ డను నాతఁడు జితాహారుడు, జితమత్సరుఁడు, జితేంద్రియుఁడు, నై; మూడువేల సంవత్సరములు ఘోరమైన తపస్సు చేసెను. దేవత లాతని శిరమున బూలవాన కురిపించి కావలసిన వరము లన్నియుఁ గోరుకొను మని, తపము చాలింపుమనియుఁ, బలికిరి.

'ఓ దేవతలారా! నా తపమునకు సంతుష్టులైతిరేని; విశ్వము నాకు వశమగునట్లును, నేను విద్యాధరుఁడ నగునట్లును, వర మొసఁగు' డని యా పిప్పలుఁడు కోరెను. దేవత లట్లే యనుగ్రహించి, యదృశ్యులైరి. పిప్పలుఁడు విద్యాధరత్వమునొందెను. విశ్వమున నేదిభావించిన నది యాతనికి ప్రాప్తించుచుండెను. తన కోరిక సఫలమైన దని యాతడు బుజావు పరచుకొని విశ్వమును వశపఱుచు కొన్న నాకు భూలోకమున సమానులు లేరని అత్యంత గర్వితుడై యుండెను.

అట్టిస్థితిలో నున్న యాపిప్పలునిఁ జూచి యచటిసరస్తీరమున నున్న యొక సారసపక్షి యిట్లు పలికెను.

'ఏల యింత గర్వము వహించెదవు? ఇది నీ పతనమునకే కారణమగును. సర్వము వశ్యమైనందుకుఁ దగిన బుద్ధి నీయందుఁ గానవచ్చుట లేదు. అవశ్యమైన కర్మను గ్రహింపుము. అర్వాచీన పరాచీనములను దెలిసికొనకుంటివి. సర్వసిద్ధికది యవసరము.

కుండలుని కుమారుడు, ధీమంతుడునైన సుకర్మ యనువాడు అర్వాచీన పరాచనతత్త్వము నెఱిగినవాఁడు. సమస్త జగత్తు నాతనికి వశ్యమై యొప్పును. ఆతని కెవరును జ్ఞానము బోధింపలేదు. గొప్ప తపస్సైన నాతడు చేసియుండలేదు. నిర్మలాచారము, పరిశుద్ధస్వభావమును, గలిగి; మాతాపితరులకు హితమొనరించుచుండును. బాలుడైనప్పటికి నాతనికిఁ గల జ్ఞానము నీకు లేదు. వ్యర్థముగా గర్వించుచుంటివి.'

పిప్పలుఁ డామాటలు విని 'పక్షి రూపమున నుండి నన్నిట్లు నిందించుచున్న నీ వెవడవు? బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వడవైన నై యుందువు. అర్వాచీన పరాచీన తత్త్వము నాకెఱిఁగింపుము.' అని యడిగెను.

'నీకు సమస్తము నాతఁడే తెలుపును. ఆసుకర్మకడకుఁ బొమ్ము.' అని సారసపక్షి పలికిన మాటపైఁ బిప్పలుఁడు ధర్మారణ్యమునకుఁ బోయి యచటఁ బితృపాదసేవ యొనరించుచున్నట్టియు, జ్ఞానవంతుఁడైనట్టియు, పుణ్యదర్శనుఁడైనట్టియు సుకర్మను జూచెను.

సుకర్మ వచ్చిన యాపిప్పలు నర్ఘ్యపాద్యాదు లొసఁగి పూజించి, యాతనిచే బ్రశ్నింపఁబడినవాడై యిట్లు చెప్పెను.

'పిప్పలమునీ! తపస్సుచేఁ గల్గిన ప్రపం[చ] వశ్యతచేఁ గర్వము వహించి యుంటి[వి] నిన్నచటి కంపిన సారసపక్షి యొ[క] బ్రాహ్మణుఁ డని గ్రహింపుమ[ు] బ్రాహ్మణ్యాది సకలజగత్తు బ్రహ్మ[...] సర్వదేవతలు అర్వాచీన మని [...] యము. అవ్యక్తము, మోక్షరూపము, ప[...] త్పరము, మంగళకరమునైన పరాచీన[...] వివరింతును. సనాతనమైన యా మూ[...] బ్రహ్మమును యోగులుకూడ గ్రహి

జాలరు. వేదములుకూడ పరాచీనములను గురించి నిస్సంశయమయిన నిశ్చయము గలిగి యుండవు అర్వాచీనము సకలము పరాచీనము నిష్ఫలము'

ఇట్లు సుకర్మ తెలిపిన విషయములు విని 'నీకిట్టి మహాజ్ఞానము దేనివలనఁ గలిగినదో తెలుపు' మని పిప్పలుడడుగగా, సుకర్మ యిట్లు తెలిపెను' నేను శరీరమును శోషింపఁజేసికొని తప మొనరించి యుండలేదు మంత్రములేమియు నెఱుఁగను వ్రతము లెవ్వియు నాచరింపలేదు

భక్తితోఁ బితృపూజ యొనరించుట మాత్రి మెఱుఁగుదును పితృస్నానోదకము తోడనే స్నానపానాదులు గావించెదను. దానితో నాకు నిత్యము గంగాస్నాన పుణ్యము గలుగుచున్నది సర్వవేదముల నే పుణ్యము గలదో, సర్వయజ్ఞములందు నే ఫలితము లభించునో, యట్టి ఫలము మాతాపితృ ప్రపూజనము వలనఁ గలుగుచున్నది

పితృభక్తియుతుడైన పుత్త్రుడు గల మాతాపితరు లెచట నుందురో యచట నే గంగ, గయ, పుష్కరము నుండును మాతాపితరుల స్నానకాలమందలి జలబిందువులు మీదపడిన తనయునకు సర్వతీర్థ ఫలము లభించును మృష్టాన్నపానాదులచేఁ బితరులకుఁ బ్రీతి గలిగించు కుమారునకు నిత్యము నశ్వమేధ యాగ ఫలము కలుగును. ఆకలి గొనియున్న తలిదండ్రులు భోజనము చేయక యుండగా మృష్టాన్నము భుజించు కుమారుడు మూత్ర పురీషముల నాస్వాదించు పాపి యగును.

తలిదండ్రుల నవమానించు కుమారుడు కోట్లకొలది జన్మముల దుష్టమైన గృధ్రమై జనించును ఇహపరలోకములఁ దరింపఁ జేయుటకుఁ దల్లితో సమమైన తీర్థమును దండ్రితో సాటివచ్చు తీర్థమును లేవు.

పితరులను బూజించిన సర్వదేవతలును పూజితు లగుదురు. పితృసేవవలన ముల్లోకములును సంతసము నొందును తల్లిదండ్రులు నిర్వికారులై యుండునంతకాలము సమస్తమును పరిత్యజించి తత్పరుఁడై వారి సేవ చేయుచుండవలయును తన గుణముల చే మాతాపితరులను సంతోషపఱచు తనయునకు సకలధర్మములు సిద్ధించును

మాతాపితరులకు సంతోషము గలిగింపఁదగును వారికిఁ గోపముకలిగింపరాదు. మాతృశాపమున సర్పములకు సర్పయాగమున వినాశము సంభవించెను తండ్రి సంతుష్టి వలన పూరున కుత్తమ రాజ్యప్రాప్తి గలిగినది యదువునకు వారికిఁ దండ్రి కోపమువలన దుఃఖము సంభవించినది కావున సర్వప్రయత్నముల చేతను మానవుడు పితృభక్తుఁడు కావలయును తల్లికి సాటివచ్చు తీర్థము లేదు. తండ్రికి సరితూగగల గురుఁడు లేడు వారి యనుమతి లేనిదే యే యితర ధర్మమును నాశ్రయింపరాదు

ఇది పరమ ధర్మము అన్యములేవియైన నుపధర్మములు. మాతృవాక్యాచరణమున నుపమన్యుడు బాల్యముననే యీశ్వరుని సందర్శించెను. అట్లే ధ్రువుడు ధ్రువత్వము నొందెను. మాతృవచన నిర్వహణమునఁ గర్ణుడు త్తమకీర్తి నందెను విజయుఁడు సోదర సహితుఁడై విజయముఁ గాంచెను ధర్మానుసారము తలిదండ్రు లుభయులే గురువులు

తలిదండ్రుల యనుగ్రహము చేతనే నాకు దివ్యజ్ఞానము గలిగినది'

ఈ విధమున సుకర్మచేఁ బ్రబోధింపఁబడి పిప్పలుడు లజ్జితుఁడై యా బ్రాహ్మణోత్తముని వీడుకొని చనియెను సుకర్మ పితృసేవా పరాయణతచే ధర్మాత్ముఁడై వెలుగొందెను

ఈ విధమున పితృతీర్థ, మాతృతీర్థములు వివరింపపడినవి భక్తితో నీ వృత్తాంతము విన్నవారు పరమగతి నొందుదురు మానవుడు సర్వప్రయత్నముల చేతను పితృభక్తి పరాయణుఁడై యుండఁదగును

(పాద్మపురాణము)
అనువాదము సం పా.

— —

# బలిజేపల్లివారి 'హరిశ్చంద్ర' నాటకం

— శ్రీ రావఁడుగు వెంకటేశ్వరశర్మ

'మంచిరచన చదివాక బాగా భోంచేసిన
ట్లుండాలి
కొంచెం బాధపడాలి, చింపుకొన్న
ట్లుండాలి,
మనస్సుకి జ్వరం రావాలి, ఒళ్లుతిరగాలి,
బాధలోంచి తేరుకొని బాగుపడాలి''

అని అధునికాంధ్ర కవితా ప్రపంచంలో అగ్రోయద్రుడైన ఆరుద్రగారు పలికిన వాక్యాలకు పదహారణాల నిఖార్సైన నిదర్శనం సత్యహారిశ్చంద్రీయ నాటకం! 'వాక్యం రసాత్మకం కావ్యం' 'సాహిత్యం ఆలోచనామృతం' అను సూక్తికీర్తులకు మణిమందిరాలను నిర్మించిన ఈ నాటకాన్ని బాల్యంలో చూచే గాంధీ మహాత్ముడు సత్యాన్వేషియై బాగుపడ్డాడు (భాష వేరనకోండి అది తర్వాత సంగతి), దీని రచయిత 'కవితా కళానిధి', 'పుంభావ సరస్వతి' బిరుదాంకితులైన శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు

ఈ నాటకం పేరు వినీవినడం తోడనే మన ముందు తరాల వారికి 'మాయామేయ జగంబె నిత్య మని దళమై పర్యోదలో నడంగియు , ఇత్యాది పద్యాలు చప్పున జ్ఞప్తికివస్తాయి పాండవోద్యోగ విజయాల్లోని పడక సీనూ (సుయోధనార్జునులు సమరానికి శ్రీకృష్ణుణ్ణి సాయమడగడం). సత్యహారిశ్చంద్రలోని కాటిసీనూ ఒకప్పటి నాటక ప్రదర్శనాల్లో చిరస్మరణీయ ఘట్టాలు! సుమా

...ంగా నూరూ, నూటయేభై సంవత్సరాల చరిత్ర కలిగిన ఆంధ్ర నాటక వాఙ్మయంలో సర్వతంత్రస్వతంత్రమైన యీ నాటకం ఒక కలికితురాయి 'సరసులగు పండితుల విమర్శనము తెల్ల, గడచి నదే ద నిర్దుష్ట కావ్య మగును' అని రచయిత ఒకచోట నాటకములో చెప్పినట్లుగా వీరిది నిజముగా నిర్దుష్టమైన గ్రంథము! వీరు సందర్భానుసారంగా తమ ఇతర రచనలను గూర్చి తెలుపుచు, దాని రచనావిధానం దృశ్య ప్రబంధ మార్గం అని పేర్కొనడం జరిగింది ఇలా-

సరవిన్ బుద్ధిమతీ విలాసము, హరి
  శ్చంద్రీయమున్, శ్రీమదు
త్తరరామాహ్వయ నాటకంబు, నళ స
  త్రాజిత్సుతోద్వాహమున్
స్థిరపుణ్య ప్రదముల్ రచించె నతఁడే
  దృశ్య ప్రబంధోరువై
ధురిఁ గేల్మోడ్చి పురాతనాధునిక రం
  గత్సత్కవి శ్రేణికిన్॥'

దృశ్యప్రబంధం అంటే కేవలం అలంకారిక లక్షణలక్షితమైన నాటక ప్రబంధాత్మకరచన మనియే కాదు ప్రదర్శన యోగ్యత, పఠన యోగ్యత గలిగిన రచనయే నిజమైన దృశ్యప్రబంధం! అదియే ఉత్తమ నాటకలక్షణ మని ఒకసారి ఆంధ్ర నాటక పరిషద్వార్షికోత్సవ సభలో అధ్యక్షోపన్యాసమిస్తూ శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు పేర్కొన్నారు సత్య హరిశ్చంద్రీయం ఇట్టి ఉత్తమ దృశ్య ప్రబంధం! ఇది నాకు నచ్చిన నాటకం ఇలా అవడానికి గల కారణాలను కొన్నిటిని స్థూల దృష్టితో వివరిస్తాను

ఈ కావ్యం నచ్చడానికి గల మొదటి కారణం ఇందు సమాజ వాతావరణంలో వెలసిన కథాసూచనాత్మకమైన రచనా విధానం, పాత్రల సంభాషణల పరంగాను, వర్ణనల పరంగాను కథాసూచన చేయడం జరిగింది. మొదటిది పాత్రల సంభాషణపరం. దీనికి కథారంభమున ఇంద్రుడు సురసభలో మునుల నుద్దేశించి త్రిలోకాలలో సత్యనిష్ఠాతత్పరు డెవ్వడని ప్రశ్నించు తీరు నిదర్శనం -

'తన సామ్రాజ్యము పోవనీ, స్వకుల కాం
  తారత్నమున్ బాయనీ,
ధనమానంబు లడంగనీ, ప్రబల బా
  ధల్ తన్ను బాధింపనీ,
తనయుం డీల్గిన నీల్గనీ, యనఘు స
  త్యస్థైర్యముల్ బాయకుం
డిన పుణ్యుండు త్రిలోకగణ్యుఁ డొకఁడే
  నిం గల్గినం దెల్పుఁడీ॥'

ఇందు నాటక కథలో జరగబోయే సన్నివేశాలు ఒక క్రమపద్ధతిలో అయత్నసిద్ధంగా సూచింపబడడం విశేషం!

ఇక పాత్రలు దుఃఖోద్వేగంతో తమకు తెలియకుండగనే తమ మాటల్లో జరగబోయే కరుణరసాత్మక సన్నివేశాలను సహజధోరణిలో సూచించాయనడానికి భార్యా-బిడ్డల నమ్మిన హరిశ్చంద్రునితో లోహితాస్యుండు తన్ను వెంట తీసికొని వెళ్ళమని కోరినపుడు రాణి పల్కిన ఈ పద్యం ఉదాహరణం -

'కొడుకా! కష్టము లెన్నివచ్చినను నీ
  కున్నాకు నాకీదులం
బెడబాటుల్ ఘటియింపకుండుటొకమే
  లేయంచు నే సంతసం
బడితింగాని యెఱుంగ నిన్నుఁ దెగన
  మ్మంజాలి హా లోహితా
కడకీ నాఁటికిఁ గాలసర్పమునకుం
  గైకోలు గావించుటన్॥

హా! తండ్రీ! నీకు అమంగళము ప్రతిహతమగుఁ గాక!

కడకీ నాటికిఁ గాలకౌశికునకుం
గైకోలు గావించుటన్'

ఇందులో మున్ముందు కథలో లోహితుడు నిజంగా కాలసర్పానికి బలి అవుతాడు గదా! ఆవిషయమే ఇచట సూచింపబడింది! కథాసూచనలలో ఇంతటి సహజధోరణి మరే ఇతరనాటకాలలోనూ మనకు కానరాదు

ఇక వర్ణనలపరం - ఇందును కథాసూచన గావింపబడె ననుటకు వడుగులతో అడవికేగిన లోహితునిరాక కెదురుచూచుచు, చంద్రమతి పల్కిన సాయంకాల వర్ణనాత్మకపద్యం తార్కాణము -

'కొడుకస్తంగతుఁడయ్యె నంచుఁ దలివిన్
  గోల్పోవుచున్ గన్నప్రే
ముడిఁ జింతించెడి లోకబాంధవునకై
  పూర్వాశ, ప్రాణేశుఁడె
య్యేడకో పోయెనటంచుఁ బద్మిని సదా
  భృంగిరవ వ్యాపృతిన్
దోడఁ గెన్ మోము ముడించి యేడ్వ,
  నెట బం
  ధుత్వాగ మింతే కదా!'

కుమారుడైన సూర్యుడస్తంగతుడయ్యె నని పూర్వాశ, ప్రాణేశు డెక్కడికో పోయె నని పద్మిని, దుఃఖిస్తున్నాయనడంలో సుతునికోల్పోయిన, భర్తకు దూరమైన, చంద్రమతి స్ఫురించడం విశేషం గదా! బాగుగా పద్మిని మోము ముడించెనను విషయాన్ని 'ముడించి' అని పూర్ణబిందు పూర్వకంగా చెప్పడం ఒకకళా విశేషం! ఇందలి అర్థాంతరన్యాసం గూడ ఎంతో సమంజసమైనది. ఇందు సూర్యుణ్ణి లోకబాంధవశబ్దంతో పేర్కొనడం ఎంతో సముచితం ఇలాంటి పద్యాలను బట్టే యీనాటకానికి ప్రబంధత్వం పుష్కలంగా ఏర్పడిందనవచ్చు. ఇటువంటి వర్ణనలు ఇందులో అనేకాలు

ఈ కావ్యం నాకు నచ్చడానికి గల తరువాతి కారణం వ్యావహారికమునకు సమీచీనమైన యిందలి రచనా విధానం. సురసభలో ఇంద్రుడడిగిన ప్రశ్నకు సమాధానాన్ని మును లాలోచిస్తూ ఉండగా, కలహప్రియుడైన నారదుడు పలికిన మాటలు దృష్టాంతాలు.

'పైనేమున్నది చెప్పు మౌనివరుఁడ! వి
  శ్వామిత్ర! నీకింత సే
పా? నిన్నే వచియింపు మోకలశజా!
  ఆలోచనల్ చాలుఁ బో
వా? నీకైన మతింగ! గౌతమ! ఇదే
  లా? చెప్పరాదా? వశి
ష్ఠా! నీవొక్కఁడవే సమర్థుఁడవు లె
  మ్మా! పేరు వోనిమ్మా!'॥

ఈ పద్యంలోని వాచికం వ్యావహారికానికి సమీచీనమై నటునికి చక్కని అభినయ నైపుణ్యాన్ని ప్రదర్శించడానికి ఎంతో అనుకూలంగా ఉంది. కనుకనే యిది దృశ్య ప్రబంధంగా పేర్కొనబడింది.

తెలుగు పలుకుబడులతోనూ, లోకోక్తులతోను కూడిన రచనా విధానం గూడ వ్యావహారికానికి సమీచీనమైన సజీవభాషయే! యాగంకోసం హరిశ్చంద్రుణ్ణి ధన మడిగి, వాని యొద్దనే ఉంచవలసినదన్న విశ్వామిత్రునితో, ఆధనాన్ని మీ ఆశ్రమములో ఉంచుకొను మని సత్యకీర్తి పలుకగా ముని వానితో పలికిన పద్యం పైవిషయానికి ఉదాహరణం -

'అకటా! భద్రముసేయ మా కచటఁ గొం
  పా, గోడియా, యొప్పు డమా
అక నేత్రంబుల మూసి, నిశ్చలతపః
  ప్రారంభుఁడై యుండు మా
నికడన్ దక్కె నె సొత్తు, దొంగ లెపుడే
  నిన్ దాని నాశించి దో
చుకొనన్ జేయున దేమి? దాఁచ కొనన
  చ్చోఁ బెట్టియా? బేడయా?'॥

ఈ పద్యంలో 'కొంపా-గోడియా,' 'పెట్టియా-బేడయా' అను జంట పదాలు చక్కగా అతికినట్లుగా ప్రయుక్తమయ్యాయి. అలాగే 'మెత్తనివానిఁ జూచు నెడ మిక్కిలి మొత్తఁగఁ జిత్తమౌగదా!' ఇత్యాది సూక్తులు గూడ ఈ సందర్భంలో పేర్కొనదగినవి.

ఈ కావ్యం నాకు నచ్చడానికి గల మరో కారణం సర్వజనాకర్షకమైన యిందలి శైలి. భాషలో పేలవత్వం లేని, భావానుకూలమైన సంస్కృతాంధ్ర సమాస సమ్మిశ్రితమైన రచనయే సాధారణంగా సర్వజనాకర్షకమైన శైలి అవుతుంది. ఇలా అనడానికి అడవుల్లో నడువలేక బాధపడుచున్న చంద్రమతిని ఉద్దేశించి, ఆమెతోనే హరిశ్చంద్రుడు పలికిన ఈ పద్యం నిదర్శనం -

'ఏనాఁడు నడచినా వీ యెడారుల లోన
  సలలితారామ సీమలనె కాని
ఏనాఁడు తలసూపి తీవ్రచండపు టెండ
  కలఘు మాణిక్య కాంతులకె కాని
ఏనాఁడు చవిచూచి తీ కందమూలముల్
  సరసరాజాన్న భోజనమె కాని
ఏనాఁడు చెవిఁజేర్చితీ క్రూరమృగరుతుల్
  లీలా శుకాలాప పాళిఁ గాని
కటకటా! యెన్నఁడెఱిఁగితుత్కటదినేశ
ఖరకిరణజాలతప్త కర్కశ శిలాద్రి
కటక గమన శ్రమోద్భూత చటులచింత
నను వరించుటఁ జేసి యీనాఁడె కాని॥

పైసీసపద్యంలోని పెద్దపాదాలలోని ప్రతిరెండవ అర్ధపాదము సుకుమార భావానుకూలమైన సంస్కృత లలితపద విన్యాసంతో గూడి చంద్రమతి పూర్వ వైభవానికి ప్రతీకగా ఉంది. ఇక గీతిలోని సుదీర్ఘ సంస్కృత సమాసగతి భారంగా సాగి చంద్రమతి అడవులలో పడలేక పడలేక పడెడి యిడుముల స్వరూపానికి చిహ్నంగా ఉంది! మొత్తమ్మీద ఇందలి సంగీతానుకూలమైన శైలి సర్వజనాకర్షకము.

ఈ కావ్యం నాకు నచ్చడానికి గల తరువాతి కారణం ఇందలి కరుణరస పరిపోషణ విధానం! హృదయాలను కదలించే కరుణరస స్ఫోరక సన్నివేశాలు ఇందులో కోకొల్లలు! చంద్రమతి లోహితుని రాక కెదురుచూస్తూ

'చెడుగా! యేపని చేతగాని యెడ నా
  చే నాకె? ముప్పూటలుం
గడుపుబ్బ న్నిను మేపనంచుఁ దనువున్
  గాయాలుగాఁ గొట్టినన్
బడలేకా వ్యథఁ బ్రాణభీతి 'గురుఁడ
  మ్మా! మాడవే' యంచునా
కడ కేతెంచిన పుత్రు కష్టగతి నా
  గర్భంబు ఛేదించెడిన్'॥

అని గత సన్నివేశాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనిన తీరును భావిస్తూ ఉంటే ఎవరికైనా

కడుపు తరుక్కు పోగలదు. 'గురుఁడమ్మా! చూడవే' అనుచు తల్లిదగ్గఱకు వచ్చిన లోహితుని కష్టగతి కరుణరస స్ఫోరకము! ఇక చంద్రమతి లోహితాస్యుఁకి వచ్చిన ఆపద సెలవింగి, కాలకంటకియొద్ద సెలవుతీసికొనుచు పలికిన పద్యాన్ని గూర్చి చెప్పవలసినపనే లేదు. అది కరుణరసమే ఆత్మరూపాన్ని దాల్చిందా అనిపిస్తుంది; ఆపద్యమిది:-

కడుప్రాణంబున నున్నవాఁడో విసమె
  క్కెన్ జచ్చెనో కానలో?
కొడుకమ్మా! నను బంపకుండినను యో
  గ్యుండై వైద్యున్ ద్వరం
బడి యచ్చోటికిఁ బంపుమమ్మ! బ్రతికిం
  పం జాలునేమో సుతున్
గడకాళ్లంటి నమస్కరింతు సుతభి
  క్షం బెట్టి రక్షింపుమా!'॥

ఇలాగే కాటిసీనుగూడ కరుణ రసాత్మక సన్నివేశమే!

ఇక ఈ కావ్యం సాధునచ్చడానికి గల మరో కారణం ఇందలి సజీవ పాత్ర చిత్రణం!

'అరయన్ వంశము నిల్పనేకద! వివా
  హం బట్టి వైవాహిక
స్ఫురణం బిప్పటి కన్నఁడో జరిగె, స
  త్పుత్రుండు పుట్టెన్, వయః
పరిపాకంబును దప్పుచున్నయది, యీ
  ప్రాయంబునన్ వర్ణనం
కరపుం బెండిలి నేల చుట్టెదవు? నా
  కంఠంబునన్ గౌశికా!'॥

ఈ పద్యంలో హరిశ్చంద్రుని ధర్మాభిరతి సజీవచిత్రణ గావింపబడింది! ఈకవి గావించిన సజీవ పాత్రచిత్రణలలో పేర్కొనదగింది నక్షత్రకపాత్ర, గౌరన తన హరిశ్చంద్ర ద్విపదలో తొలిసారిగా ఈపాత్రను పరిచయం చేయగా, ఈకవి యీపాత్రకు మెఱుగులను దిద్దడం జరిగింది. హాస్యకరుణములకు ప్రతీకగా చిత్రింపబడి, జిడ్డులాగా మనుషుల్ని పట్టి జలగలాగా పీడిస్తూ, గడ్డుసమస్యల్ని కల్పించే వ్యక్తికి ఉపమాన వస్తువుగా లోకవ్యాప్తమైంది ఈపాత్రయే! ఒకసారి హరిశ్చంద్ర నాటకం జరుగుతోందట! మఃకవిగారే నక్షత్రక పాత్రను ధరించారు. అరణ్యాల్లో హరిశ్చంద్రుణ్ణి నక్షత్రకుడు బాధించే సన్నివేశమది. ఆనాటకాన్ని చూస్తూన్న ఒక పోలీసు ఇన్స్పెక్టరుగారు ఆసన్నివేశాన్ని నిజమైన దానినిగా భావించి వెంటనే స్టేజి మీదకొచ్చి హరిశ్చంద్రుణ్ణి బాధిస్తూన్న నక్షత్రకుణ్ణి కొట్టబోయారట! (ఈవిషయాన్ని ఒకమిత్రుడు నాతో చెప్పాడు) ఈసన్నివేశాన్ని బట్టి ఇందెంతగా సజీవ పాత్ర చిత్రణగలదో తెలుస్తోంది

ఈ నాటకంలో గల త్రికాలాబాధితమైన హితోపదేశాంశంకూడ ఆకర్షణీయమైనదే! అడవులలో లోహితాస్యుడు అన్నోదకములకు మోమువాచి ఆయాసపడుచున్నప్పుడు వాని దుస్థితిని గమనించిన హరిశ్చంద్రుడు విచారముతో చంద్రమతితో పలికిన ఈపద్యం పైవిషయానికి నిదర్శనం :-

'తిరమై సంపదలెల్ల వెంటనొకరీ
  తిన్ సాఁగిరా వేరికే
సరికేపాటు విధించెనో విధి యవ
  శ్యప్రాప్య, మద్దాని కె
వ్వరుదప్పించెద రున్నవాఁడ నని గ
  ర్వం బేరికిన్ గాదు, కిం
కరుఁడే రాజగు, రాజె కింకరుఁడగున్
  గాలానుకూలంబుగన్'॥

ఇందలి చివరిపాదం లోకోక్తిగాకూడ వాసికెక్కింది.

అలాగే ఋణబాధ కడు దుర్భర మని హరిశ్చంద్రుడు చంద్రమతితో పలికిన విషయంకూడ త్రికాలాబాధితమైన నిత్యసత్యాంశమే! ఆపద్య మిది :-

'సరివారి న్నగుబాటు, పిమ్మట మన
  శ్చాంచల్యరోగం బనం
తర మాహారముసం దనిష్ట మటు మీఁ
  దన్ దేహజాడ్యం బటన్
మరణంబే శరణంబు; పెక్కుదివసముల్
  మంచానఁ జీర్ణించి, యిం
తిరో! ఈ ప్రాణములన్ ఋణవ్యథలకం
  టెన్ దుస్సహం బే దిఁకన్' ॥

ఇలాంటి పద్యాలలోనే కవి లోకజ్ఞతకూడ అభివ్యక్త మయ్యేది, ఈ నాటకంలోని భావానుకూలచ్ఛంద స్స్వీకారం పరమౌచిత్యసముపేతం! సర్వజనాకర్షణీయం! ఇంతేకను సకల జనామోదప్రాయమైన యీ సత్యహరిశ్చంద్రీయ రూపకంలోని రచనావిధానం సత్యము, శివము, సుందరము!

—... —

కీ. శే. డా. చిలుకూరి నారాయణరావుగారి

# 'ముసలమ్మ' పదము

– శ్రీ జి. జి. ఎస్. మోహన్, ఎం.ఏ., పిహెచ్.డి.

(గతసంచిక తరువాయి)

కోడలు గడుసుదనమునకు, తన నిస్సహాయతకు చింతించి 'అమ్మా నీతో మాటలాడగా అంత సమర్థత లేదే నా' కనినది. చావునకు సమస్త జీవులును భయపడుననియు, కనుకనే ఆ గంగమ్మకు ఒక్కరు బలియైన అందరును జీవింతురనియు, కాని ప్రాణభీతిచే ఎవ్వరును సాహించుటలేదనియు చెప్పినది. అత్తా కోడళ్ళ సంవాదమున రచయిత చక్కని నాటకీయతను, జీవుల పరస్పరానుబంధమును తేటపరచినాడు. గురజాడ రచనలో ఇట్టి నాటకీయ కథనమే కన్పట్టును.

'ఒక్కరుచచ్చి ఊరంతా బ్రదికే ఉపాయముంటే' తానే బలియగుదుననియు, చావంటే చాల వేడుక అగుచున్నదనియు, సెలవిచ్చి పంపుడనియు, ప్రార్థించుచు

'జీవంపోతే చెడు నీ దేహము
దేహంపోతే జీవం చెడదే'
జీవము జీవులకోసము దేహము
విడితే శాశ్వత మవుతుం'

దని దేహపు నశ్వరత్వమును, ఆత్మయొక్క శాశ్వతత్వమును తేటపరచినది ముసలమ్మ. అత్తమామలకు, మగనికి, బావలకు మ్రొక్కినది. ఎవ్వరినోటను మాటలురాక నిశ్చేష్టులయిరి. ముసలమ్మ ముస్తాబయిన రీతిని రచయిత కన్నులకు కట్టినట్లు చిత్రించినాడు.

'ముసలమ్మప్పుడు ముస్తాబయ్యెను
మొగమున పసుపును సొగసుగ నలదెను
అడుగులదాకా పారాణి పూసెను
కుంకుమ నుదుటను కుదురుగ నిలిపెను
కన్నుల నిండా కాటుక దిద్దెను
పసుపుచీర నొసపరిగా కట్టెను
మొగ్గలరవికెను నిగ్గుగ దొడిగెను
కొంగును నడుమున కూర్చి బిగించెను
కూడ దీసి తన కురులను దువ్వెను
గొప్పగ నొప్పగు కొప్పును చుట్టెను
కొప్పున జాజులు కొల్లగ తురిమెను
గన్నేరులు కంఠమున ధరించెను'

లయప్రధానముగా నడచిన ఈ గేయ చరణములు కరుణ రసాత్మకములుగానున్నవి. అంతేకాక ముసలమ్మ హస్తమున సురకత్తిని పట్టుకొని, దానికొనకు నిమ్మపండు గ్రుచ్చుట, చేతుల గంధము పూసికొనుట, కాళ్ళకు గజ్జలు ఘల్లన కట్టికొనుట ఇత్యాదులు ఆదిశక్తి అపరావతారమను నట్లు ముస్తాబయినదని రచయిత వర్ణించినాడు. పళ్ళెములో పలపండ్లనమర్చి, కుంకుమ పసుపును, అక్షింతలను సమకూర్చినది. అట్లే వెండిగిన్నెలో గంధమూ, పయిడి గిన్నెలో పాలను, పళ్ళెమున నుంచినది. ఎడమ చేతితో పళ్ళెమును ఎత్తి, కుడిచేతితో సురకత్తిని పట్టి అపరశక్తివలె నున్నదట ముసలమ్మ.

నిలువుటద్దమున నీడను చూచినది. తన వేషములో తన్ను తా మరచినది. ఇతరులకై తన హితమునే మరచినది. ఆత్మత్యాగము అవనికి రక్షణము 'ఆత్మను విడలోకాత్మను గొలుచుట, వీరుల కక్షయ లక్షణము' అని తలచినది ముక్తీశ్వరి ముసలమ్మ. అన్నెము పున్నెము ఎరుగని పంద్రెండేండ్ల బాలయైన ముసలమ్మ తానొక వీరవనితగా, 'పేరంటాలు'గా పృథివిని రక్షింపవలసినది. అట్టి వీరవనిత చెరువుత్రోవను పట్టినది. నెరివిడిచిన ఆ దరికిని చేరినది ముసలమ్మ. బంధుమిత్రాదులు, గ్రామప్రజలు ఆమెను అనుసరించిరి. ముసలమ్మ పళ్ళెరమును దింపి గంగమ్మకు పూజలు సలిపి నమస్కరించినది.

ముసలమ్మ గంగాభవానిని ప్రార్థించిన చరణములు ఆవేశపూరితములుగా నున్నవి

జాలారివారింట జన్మమె
త్తిన దానవే! గంగాభవానీ!
ఈశ్వరుని తలపైని ఎక్కియా
డెడిదానవే! గంగాభవానీ!

పార్వతమ్మతోడ పంతాలు
గలదానవే! గంగాభవానీ!
ఆదిశక్తివి నీవనంత శ
క్తి నీవటే! గంగాభవానీ!
జగము లేలే తల్లి చల్లగా
రక్షించవే! గంగాభవానీ!'

అని గంగాభవానిని కీర్తించినది. గ్రామప్రజలు భయభీతులతో నున్నారని, ఆగ్రహించిన నిలువజాలరని, ఆవులను దూడలను ఆదరముతో కావుమని, ఆ బాలగోపాలమును ప్రీతితో కాపాడుమని కోరినది.

'నేను వస్తిని తల్లి నీ కోర్కె
చెల్లింతునే! గంగాభవానీ!
కరుణతో నన్ను నీ కడుపులో
పెట్టుకోనవే! గంగాభవానీ!
నన్ను చేకొని వీరి నయముగా
రక్షింపవే! గంగాభవానీ!

అని ప్రార్థించి నెరిలోనికి వెళ్ళి కూర్చొనినది.

బంధుమిత్రుల నుద్దేశించి గంగమ్మ నన్ను కరుణతో కాపాడును. మీ కభయమిచ్చినది. చల్లగా మీ మీ యిండ్లకు పొండని విన్నవించినది.

'ఇదిగో కత్తికి ఎరనై రక్తము
ఉపహారముగా ఉంతును గంగకు
నేనుకూలిన నిమిషము నాపై
రాళ్ళను మట్టిని కప్పండి'

ఆమె ఆనతిచ్చినది పేరంటాల నై పిల్లల మేకల, పాడి పంటల వర్ధిల్ల జేయుదు ననియు, ఆవులదూడల నరయు చుందు ననియు, రోగముల నాశము చేయుదు ననియు, నిర్భయముగా జీవించు డనియు అభయ మిచ్చినది

'నను మరువకుడీ నాయనలారా
సెలవియ్యండీ తల్లులారా'
అని తనకత్తిని హస్తమునం గొని
కడుపున పొడుచుక పడెనచట'–

ఈ ఖండికలోని మొదటి రెండు చరణములు 'పూర్ణమ్మ' లోని

'నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొక పరి తలవండి'—

అను చరణములను తలపించుచున్నవి

తక్కిన రెండుచరణములతో పాటు

'రక్తంబరదలు రయమున కారెను
గంగమ్మకు అటుకడుపును నిండెను'

అను చరణములలో బీభత్స, కరుణములు పెనవేసికొనినవి ఇట్టి హృదయ విదారక దృశ్యమును కన్నులకు కట్టునట్లు చిత్రించిన రచయిత ధన్యుడు

పిమ్మట గ్రామప్రజలు స్పృహ తెచ్చుకొని అతికష్టమున రాళ్ళతో మట్టితో గండిని పూడ్చిరి పరులకొరకై ప్రాణము వదలి ఆత్మత్యాగమును ప్రదర్శించి పేరంటాలైనది ముసలమ్మ చివరగా ముసలమ్మను శ్లాఘించుచు రచయిత

'హృదయం నెరిలో నింపుగ నున్నది
కల్మషాలతో కప్పడి యున్నది
ఓ! యని పిలిచే ఉత్సాహులకును
ఓ! యని పలుకును ముసలమ్మ'

అని ఈ చిన్న పదమును ముగించిరి. గురుజాడవారి

'కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేనిపసల్
హంసల జేరెను నడకల జెడగలు
దుర్గను జేరెను పూర్ణమ్మ'

అను చరణములలోని అనుభూతిని జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

ఇక డా కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము' నకు డా చిలుకూరివారి 'ముసలమ్మ పదమున'కు కథలో నించుక వ్యత్యాసము కలదు బుక్కరాయ సముద్రము పొంగి కట్టతెగిపోయినది. ఇంతవరకు కథాంశములు రెండింటను సమానమే ఊరిరైతులు గ్రామదేవతయైన పోలేరమ్మను ప్రార్థించగా ముసలమ్మ అను స్త్రీ బలియైనచో ఆపద నివారణమగు నని ఆకాశవాణి పల్కినట్లు 'ముసలమ్మ మరణము' న కలదు కాని 'ముసలమ్మ పదము'న 'అప్పుడక్కడను ఒక్క ముదుసలిది ఆవేశములో అరుచుచునుండెను' ఆముసలమ్మయే గంగాభవాని అనియు, తనకిపుడే నరబలి కావలెననియు ఆక్రోశించినది ఇట గంగాభవానికి 'ముసలమ్మ'యే కావలెనని చెప్పబడలేదు పైపెచ్చు ముసలమ్మ తనకు తానే గ్రామప్రజల రక్షణకై అత్తమామలు, బావలు, కట్టుకొన్న మగడు ఎంతవారించినను వినక ఆత్మత్యాగము చేసికొనిన సాధ్వీమణి కట్టమంచి వారి ముసలమ్మ నీటబడి పరమపదించినది చిలుకూరివారి ముసలమ్మ నెరిలో కూర్చొని కత్తితో పొడుచుకొని ప్రాణత్యాగమొనర్చుకొనినది ఈ కథనము ప్రకారము 'ముసలమ్మ పదము'లో అత్యధికమైన ఆత్మత్యాగము కన్పించుచున్నది. నాకు మాత్రము కట్టమంచి వారుకొన్ని కల్పనలను చేసినట్లు కన్పట్టుచున్నది ఈ విషయమును వారే 'ఒకానొక త్రిలింగ దేశీయునిచే వ్రాయబడి బ్రౌన్ దొరగారిచే ప్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము' అను గ్రంథమునుండి యిందలి కథను గైకొంటిని. అయినను కొన్ని యెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాడ' అని చెప్పికొనినారు 'కట్ట తెగిపోయిచోట (గండిపడినచోట) ముసలమ్మ ప్రాణత్యాగ మొనర్పగా గ్రామ ప్రజలు ఆమెతో పాటు గండినిపూడ్చివేసి ఆపన్నివారణ మొనర్చిరనుటలో సత్యాంశము! కన్పట్టుచున్నది

సంఘశ్రేయస్సును కోరి ఆత్మత్యాగమును చేసికొనిన సతీమణుల కథలు కన్నడదేశమునను గలవు ముసలమ్మ పదమును బోలినదే 'కెరెగెహార్'అను కన్నడ కవనము అట్లే బెంగళూరు కోట సింహద్వారమును నిర్మించునపుడు కెంపెగౌడ కోడలు లక్ష్మమ్మ కూడ తనకుతానుగా ఇట్లే ఆత్మత్యాగముచేసికొని నట్లు కథ కలదు

డా చిలుకూరివారు ముసలమ్మ పదమును చక్కని వ్యావహారిక భాషలో వ్రాసిరి వీరు 1915 లోనే వ్యావహారిక భాషా రచనను ప్రారంభించిరి 1910లో కవిత్వము వ్రాయనారంభించిరి చిత్రకవిత్వమును కూడ వ్రాసెడివారట తుఖ్ఖాంబ అను గేయకావ్యమును కూడ రచించిరి

ముసలమ్మ పదమున దీర్ఘ సమాస భూయిష్ఠమైన ఖండిక ఒక్కటియే కన్పట్టుచున్నది అది బుక్కరాయ సముద్రమును వర్ణించు సమయమున వ్రాసిన

'లీలా లోల త్తరంగ మాలా
డోలా విహారణ ఖేలాప్రముదిత
జాల పాద హేలావిలసిత మా

అను ఖండిక, వ్యర్థపదాడంబర మెంటను ఈ లఘుకావ్యమున కన్పట్టదు.

# నన్నయ - తరలము

- శ్రీ సాంబశ్యా వరిమి, ఎం ఏ

భారతము సాగరము వంటిది ఎంత శోధించినను అణిముత్యములకు కొదవ లేదు ఈ మాట సంస్కృత భారతము నకే కాదు ఆంధ్రభారతమునకు, అందునా నన్నయ భాగమునకు వర్తించును ప్రస్తుతము నాకు దొరికినది తారళ్య 'తరల' మణి

'కవిరాజ విరాజిత' సాహిత్య 'పృథ్వి' లో 'వసంతతిలక' మును దిద్దిన 'లయ గ్రాహి' ఛందో 'మానినీ' 'మత్తకోకిల' 'వనమయూర' 'శోత్సాహ' నాట్యాను గుణముగ 'స్వాగత' 'దండక'ము నాలాపించినది ఆంధ్ర భారతీ దేవీ భారతాననమున 'శ్రీవాణీ తిలక రచనతో కావ్యవతరణాలంకారమునకు శ్రీకారము చుట్టబడినది ఆదికవి నన్నయ పుంభావ వాణీరూపుడై తొలితెలుగు భారత భారతీ దేవిని తీర్చిదిద్ద హరిహరాది దేవతలను భక్తి దలచి, విద్వజ్జనుల యనుగ్రహమును వడసి తా నేర్చిన విధముగ కావ్యారంభము కావించినాడు

నన్నయ కావ్య ప్రణాళికలో వృత్త స్వీకరణమునకు కూడ సముచిత స్థానమొసగి, రసానుగుణముగ, భావాను గుణముగ, సన్నివేశాను గుణముగ వృత్తము లను గ్రహించినాడు నన్నయ గ్రహించిన (విశేష) వృత్తములలో 'తరల' మొకటి ఆంధ్ర భారతమున గల మొదటి తరలము-

'హరి హరాజ గజానన ప్రముఖాదిదేవత - వ.
  డాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతి
  కిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిధ వాధికున్ గురు
  బద్య విద్యకు నాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసు
  పుత్రు భక్తిఁ దలంచుచున్
(ఆది ప్ర 21 ప)

-ఇది కేవలము ప్రార్థన పద్యము హరి హరాది దేవతలను, వాల్మీకిని, స్తుతించుట ఇందలి విషయము

సాహిత్య విమర్శన వ్యాపారమును నాల్గురకములుగ సహృదయులు విభజించియున్నారు - 1) వివరణాత్మక విమర్శ (expositive criticism) 2 అభినందనాత్మక విమర్శ (Appreciative) 3 తులనాత్మక విమర్శ (Comparative) 4 నిర్ణయాత్మక విమర్శ Judiacial criticism) ఈ నాల్గురకముల కందని కొన్ని లక్షణములు మన కావ్యములలో, ఉపరి ఆంధ్ర మహా భారతములో గలవు విజ్ఞాన శాస్త్రము (Science) న ఎందుకు? ఎలా? ఏమిటి? అను ప్రశ్నల కాస్కారమున్నది. ఈ ప్రశ్నలు లేనిది Science లేదు. అలాగే సాహిత్య విమర్శ యందును 'ఎందుకు?' అను దృష్టితో సహృదయుడు కావ్యపరిశీలనము చేసిన అందని సమాధాన ముండదు

పైనిగల ప్రార్థనా పద్యమునకు నన్నయ 'తరల' వృత్తము నీ సందర్భమున ఎందుకు గ్రహించియుండెను? సాధారణముగ కావ్యములు దేవతాప్రార్థనముతో ప్రారంభించుట పరిపాటి అట్టి ప్రార్థనమును శార్దూల, ఉత్పలములలో కావించుటయు పరిపాటి నన్నయ 'శ్రీ వాణీ శ్లోకముతో భారతము ప్రారంభించినాడు మరల ఇష్టదేవతా ప్రార్థన మేమి? గానికై తరల వృత్తము గ్రహించు టేమి? అని ప్రశ్నింపవచ్చును.

'మత్తకోకిల' వృత్తములోని మొదటిగురువును రెండు లఘువులుగా మార్చిన తరలమేర్పడును రెంటియందును మాత్రా సంఖ్య సమానము ఈ తరలము మాత్రా సంఖ్య విషయమున దేశీయచ్ఛందమైన 'హరిణగతి రగడ' ను పోలియున్నది (రెండుమాత్రలుతక్కువగా) విశేషవృత్త స్వీకరణ విషయమున దేశీయచ్ఛందము లకు మాత్రాసంఖ్యలో సమానముగనున్న వృత్తములనే నన్నయాదులు గ్రహించిరని కొందరుఛందోవిమర్శకులు భావించుచున్నారు నన్నయనాటికి ప్రాచుర్యము వహించిన వృత్తములు (శాసనస్థవృత్తములు) తరువోజ సీసము, మధ్యాక్కర, ఉత్పలమాల, చంపకమాల 10 శ॥న కన్నడ వాఙ్మయమున వెలసిన 'ఆది పురాణ, విక్రమార్జున విజయ'ములలోని వృత్తములు కొన్ని నన్నయ భారతము నందును-లవు - శార్దూలము, మత్తేభము, స్రగ్ధర, మహాస్రగ్ధర, తరలము, పృథ్వీ మాలిని మొదలైనవి - నన్నయ తరలము లను గూర్చి చర్చించుట ప్రస్తుత విషయము

పై 'హరిహరాజ' పద్యమునకు పూర్వముగల సందర్భము విమలాదిత్యతనూజుడైన రాజరాజు వేంగీదేశమునకు నాయక

---

ముసలమ్మ పదమున 'చిటిదేహము', ముద్దుల గుమ్మ' అను పద ప్రయోగములు, గుమ్మడ పడుట, (గండి పడుట), కొల్లగ (అధికము), అక్షింతలు (అక్షతలు) అను మాండలిక పదప్రయోగములు చేర్పబడినవి. ఆల్లే జాతీయములును ప్రవేశ పెట్టబడినవి అన్నెంపున్నెం ఎన్నని కన్నియ, 'హంగుకు నెప్పుడు కుంగుంటుంది', 'గుండెలు గుబగుబమను', 'ఝల్లన దేహము జలదరించు' 'వెంగము మీద నెత్తురు చుక్కయిన కనబడకుండుట' ఇత్యాది

గురజాడవారి పూర్ణమ్మలో కనబడెడి భావనాశక్తికి చిలుకూరి వారి ముసలమ్మ పదము ఏమాత్రమును తీసిపోదనుటలో సందియము లేదు. *

---

ఆధునికాంధ్రకవిత్వము పుట 151.

రత్నమైన రాజమహేంద్రవరమున నుండెను. అతని సభలో పండితప్రకాండులు విద్వజ్జనులు గలరు. ఒక్కనాడు తనకుల బ్రాహ్మణుడైన నన్నయభట్టును చూచి, 'శ్రీమహాభారతంబునందలి అభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు నయ్యెడ, తద్వంశీయుల చరిత్రము విన వలయుననియు, బహుభావముల బహువిధములనున్నటులగాక 'కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ' తెనుగున భారతమును రచింపుము 'అనియును ఆనతిచ్చిన' అక్కవివరుం డిట్లనియె'. అమలిన తాంత్రా సముదయముల నెన్నుట, సర్వ వేదశాస్త్రముల సారమును గ్రహించుట, బుద్ధిబాహువిక్రమమున దుర్గమార్థజల గౌరవ భారత భారతీ సముద్రమును దరియంగ నీదుట ఆబ్రహ్మకైనను అలవి కానివి. 'అయినను దేవా నీ అనుమతంబున విద్వజ్జనుల అనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నీకావ్యంబు రచించెద నని' అని కలదు. (ఆది. ప్ర. 20ప)

'ఇకావ్యంబు రచించెద నని' 'ఆకవి' కావ్యమును ప్రారంభించినాడని గ్రహింపవచ్చును. ఇంతవరకు జరిగిన దంతయు ప్రస్తావన. కావ్యారంభము 'హారిహారాజ' పద్యమునుండి. కావ్యారంభమున దేవతాస్తుతి భారతీయ సంప్రదాయము. దీనినే 'ఆకవి'యు అనుసరించినాడు. ఇక దేవతాస్తుతి పద్యములకు శార్దూలోత్పలములు గాక తరలమునే గ్రహింపవలసి వచ్చిన దను ప్రశ్న మిగిలినది. అంతేకాదు. 'విద్వజ్జనంబుల అనుగ్రహంబునం జేసి' కావ్యము రచించెద ననుటకు కారణ మేమి? అన్నచో —

నన్నయ పూనిన కార్యము బృహత్తరము పంచమవేద మని ప్రసిద్ధి చెందిన మహాభారతమును ఆంధ్రీకరించిన విద్వజ్జనులు ఆమోదింతురో, ఆమోదింపరో, అందులకే వారి అనుగ్రహమునకై కావ్యారంభమున వారిని తలచినాడు. పై అనుమానమే నన్నయ మనసును కలచివేసినది. మనసున ఆందోళన జనించినది. ఈ ప్రభావముననే నన్నయ ఘంటమునుండి తరలము కావ్యారంభమున ప్రార్థనా పద్యమునందే అప్రయత్నముగ వెలువడినది. మనసున జనించిన ఆందోళనకు 'తరల' వృత్తమునకు సంబంధ మేమి? అను సందేహము కలుగక మానదు. దీనికి సమాధానము నన్నయ భారత భాగమునఁగల తరల వృత్త సందర్భములను పరిశీలించిన తేటపడును.

నన్నయ ఈవృత్తమును, పాత్రల మనసునఁగల ఆందోళనను ధ్వనింపఁ జేయు సందర్భమునను, పాత్రల ఔన్నత్యమును చూపు సందర్భమునను గ్రహించును. అంతేకాదు, సన్నివేశమున నొక ఘట్టము యొక్క ప్రత్యేకతను చాటుటకును విశేష వృత్తమును వాడును.

'తరల' మనగా చలనము, ఆందోళనము అని అర్థము. రాజసూయయాగాంతమున శ్రీకృష్ణునకు ధర్మజుడు భీష్ముని పనుపున అర్ఘ్యమీయ పూనగా, శిశుపాలుని కారణమున క్షత్రియలోకమున క్షోభ యేర్పడినది. శిశుపాలుని సేనాని సునీథుడు యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. అప్పుడు ధర్మజుని మనఃస్థితి ఏమి? రాజసూయయాగమునకు శిశుపాలుని కారణమున విఘ్నమగునేమో యని మనసున వేదన పడినాడు. ఆనాడు నారదుడు పల్కిన మాటలు గుర్తుకువచ్చినవి. ('... మతి రాజసూయంబు బహువిఘ్నంబు బ్రహ్మరాక్షసులు దాని రంధ్రంబరోయుచుందురు ...' సభా. ప్ర. 33 వ) మనసు ఆందోళనతో నిండినది. క్షత్రియలోకమున ఏర్పడిన ఈ విధ్వంసమును, ప్రజాక్షయము కాకుండ ఆపు మని భీష్ముని ప్రార్థేయపడినాడు. అప్పుడు అప్రయత్నముగ నన్నయ ఘంటమునుండి వెలువడిన వృత్తమే ఈ తరలము —

'ధరణిలోఁగల రాజులెల్లను
దారుణక్షయకాలసా
గరము లట్లు కలంగి రిప్పు ను
గ్రప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాశ కారము
పుట్టకుండఁగ నీవు చె
చ్చెరఁ బితామహ! వీరి కిచ్చటఁ
జిత్తశాంతి యొనర్పవే.

(సభా. ద్వి. 35)

ధర్మరాజు ఆవేదన తరల వృత్తముచే ద్యోతకమగుచున్నది. ధర్మజుని మనసున వేదన గల దని నేను చెప్పపనిలేదు. నన్నయయే 'అట్టి సకల క్షత్రియక్షోభంబు చూచి, భయసంభ్రమాక్రాంత హృదయుండయి ధర్మరాజు భీష్మున కిట్లనియె' (సభా. ద్వి. 34.) అని ధర్మజుని మనఃస్థితిని వివరించినాడు.

(ఇట్లే మత్స్యగంధి పరాశరునితో మాట్లాడు సందర్భమునగల 'తను వుమానొప్పెల' అను తరలము కూడ ఆమెకు మనసునగల ఆవేదనను వ్యక్తము చేయునదిగా నున్నది)

'హరిహరాజ' అను తరల పద్యములోని విశేషము — 'ఇకావ్యంబు రచించెద నని' పూనినాడు నన్నయ. వెంటనే మనసున ఆవేదన జనించినది. ఈ కారణముననే— హరి, హర, అజ, గజానన, అర్క, షడాస్య, మాతృ, సరస్వతీ, గిరిసుతాది దేవతాతతికి ఒక్కమ్మడి నమస్కారము చేసినాడు. పంప నన్నెచోడులును ప్రాయశః ఇదే క్రమమున దేవతలందరికి ఒక్కొక్క పద్యమునందు నమస్కారమును తెల్పియుండగా; నన్నయ ఆవేదనా భరిత చిత్తముతో అందరు దేవతలకు పద్యార్థమునందే ఒక్క నమస్కారముతో సరిపెట్టినాడు. మిగిలిన పద్యార్థమందు తనకు కల్గిన మనోవేదనోపశమనమునకు కావ్యసాఫల్యమునకు 'దుర్భరతపో విధవాధికున్' గురుపద్య విద్యకు నాద్యున్' అంబురుహగర్భ

నిభున్ ప్రచేతసుపుత్రుడైన వాల్మీకిని తలంచినాడు. నన్నయ వాల్మీకినే ఏల స్తుతింపవలసివచ్చినది?_ వాల్మీకి క్రౌంచ విషాదముచే చలించి 'మానిషాద' అను శోకమయి శ్లోకముతో రామాయణమునకు శ్రీకారముచుట్టి 'కురుపద్య విద్యకు ఆద్యుడైనాడు. అట్టి వాల్మీకినే తన మనోవేదనోపశమనము కల్గింప నన్నయ ధ్యానించినాడని ఊహింపవచ్చును.

నన్నయ పాత్రల ఔన్నత్యమును చూపుసందర్భమున తరల వృత్తమును గ్రహించు నన్న విషయమును పరిశీలింతము. _

'తరళ' మనగా నాయకమణి. (తరలా హారమధ్యగా _ అమరము) పాత్రల ఔన్నత్యమును చూపుటకై నాయకమణి సదృశములైన సందర్భములందు నన్నయ వ్రాసిన భాగమున తరళ వృత్తము కన్పించుచున్నది. ఉదాహరణము:_ సూతుడు శౌనకాది ఋషులకు భారత నిర్మాణ ప్రాశస్త్యము నెఱిగించి ద్వాపరాంతమున పాండవ కౌరవులకు ఘోరయుద్ధ మయ్యెనని అక్కురుక్షేత్ర యుద్ధమతిభయంకరమై అష్టాదశ దివసములు జరిగెననియు ఏతదాజిలో భీష్మద్రోణ, కర్ణ శల్యులాహవ భారవులుగా నుండిరనియు తెలుపు సందర్భమున తరళ వృత్తము కలదు.

'పదిదినంబులు భీష్ముఁ డాహవ
 భారకుండు గురుండు పం
చదినసంబులు కర్ణుఁడున్ దివ
 సద్వయంబు దినార్థమం
దుదిత తేజుఁడు శల్యుఁడత్యధి
 కోగ్ర వీరగదారణం
బది దినార్థముగాఁగ నట్లు మ
 హాభయంకరవృత్తితోన్॥
(ఆది. ప్ర.68 ప)

ఈ పద్యమునందు కౌరవ వీరసైనిక నికాయనాయకులు వ్యక్తము కాబడిరి. ఏకాదశాక్షౌహిణీ నాయకుడు సామాన్యుడు కాడు. నాయకమణి సదృశుడు. అని తరళ వృత్త గ్రహణముచే నూహింపనగును.

ఇట్లే పై 'హరిహరాజ' పద్యము నందును, నాయకమణి సాదృశ్యము కలదు _ హరిహరాజగజానన నార్కాది దేవతలనందరిని ఒక హారములోని మణులనుకొన్నచో పద్యార్థమున స్తుతింపబడిన కావ్యరచనకు కడంగిన వాల్మీకి నాయకమణియై అందరకు మించిన అగ్రపూజకు పాత్రుడైనాడని ఊహింపవచ్చును.

ఇక మిగిలినది ఒక సన్నివేశములోని ఒకఘట్టముయొక్క విశేషమును చాటుటకు గల విశేషవృత్త పరిశీలనము —— ('తరల'ము కూడ విశేష వృత్తమగుటచే ఈ సందర్భమున పరిశీల్యము)

ఆదిపర్వ సప్తమాశ్వాసమున 'అయ్యాజుండును యాజకత్వంబున కొడంబడి' ద్రుపదునిచే పుత్రకామేష్టిని చేయించిన అగ్నిదేవు వలన 'జ్వాలాభిలాంగుడు కరవాల బృహచ్చాపధరుఁడు వరవర్మ కిరీటాలంకారుఁడు' అగునొక కుమారుడు జన్మించెను. మఱియు _

కలపవిత్ర నీతేశరోత్పల
 కోమలామలవర్ణయు
త్పలసుగంధిల సన్మహోత్పల
 పత్రనేత్ర యుదాత్తసం
తల విభాసిని దివ్యతేజముఁ
 దాల్చియొక్క కుమారిక
జ్వలిత కుండమునందుఁ బుట్టె ప్ర
 సన్నమూర్తి ముదంబుతోన్॥
(ఆది. సప్త. 26) అనికలదు.

ఇందును తరల వృత్తమే. మహాభారత కథలో ద్రౌపది పాత్ర ఎంతకీలక స్థానము నాక్రమించినదో చెప్పపనిలేదు. అట్టి పాత్ర జననముయొక్క విశేషమును చాటుటయే ఈ తరలాగ్రహణ ప్రత్యేకత.

పాండు మహారాజ మరణ ఘట్టము నకు ముందున్న రెండులయగ్రాహి విశేష వృత్తములు ఆ సన్నివేశమునకు ఎంతయో ఉదాత్తతను కల్పించుచున్నవి. ఆవృత్తములలోని విషయము వసంత వర్ణనము. ఈ వసంతర్తువు 'అఖిలజీవలోకానంద జననంబై "సర్వభూత సమ్మోహనంబయి' పాండు రాజును' మదన సమ్మోహన మార్గణ బందీకృత మానసుడుగాఁగ చేసినది. ఈ వసంత వర్ణనలోని వైశిష్ట్యమును భారత పాఠకులు గ్రహించియే యుందురు.

ఇట్లే నన్నయ గ్రహించిన విశేష వృత్తముల విశేషభావములను ఊహింపవచ్చును.

---

* నా వ్యాసము - పంప _ నన్నయ, వ్యాసావతార వర్ణనము, నవభారతి సంచిక జనవరి 1980

---

## -♦ ఎన్నికలు ♦-

* శ్రీ బలుసు సత్యనారాయణరావుగారు మత్స్యసర్కార్ల పట్టభద్రుల నియోజక వర్గమునుండి ఆంధ్రప్రదేశ్ విధాన సభకు అభ్యర్థిగా పోటీ చేయుచున్నట్లు సమాలోచనకు సమాచారము అందఁజేసిరి.

* శ్రీ డాక్టరు నందూరి వెంకట రామకృష్ణమాచార్యులు ఎం.ఏ., పిహెచ్. డి. సెంట్రలు సర్కార్ల ఉపాధ్యాయ నియోజక వర్గమునుండి ఆంధ్రప్రదేశ్ విధాన సభకు అభ్యర్థిగా పోటీచేస్తున్నట్లు తెలియజేయుచున్నారు.

* పై అభ్యర్థు లిరువురు ఆయాస్థానములకు అత్యంత అర్హులు, సమర్థులు నని మా అభిప్రాయము.
— సంపా.

ఇంద్రగంటి (వారి) కవితాతోరణము

# "కీర్తితోరణము"

- శ్రీ ధూర్జటి వెంకటబాలాజీ

"హనుమచ్ఛాస్త్రి సుకవి
నిసర్గైన కవి" అంటే చాలు.

మహాకవి, కవిశేఖర, కవిభూషణ, కవిశేఖరలాంటివి ఏవో [బరువులు] తగిలించ నక్కరలేదు

కవి అంటేనే గొప్పబిరుదు,

ఈమాటలు పలికినవారు ఎవరో కాదు అధునికాంధ్ర కవితా స్రష్టాతుడు కృష్ణశాస్త్రిగారు-

ఆయన భావకవి - అభ్యుదయకవి, సంప్రదాయకవి ఇంకా చెప్పాలంటే కృష్ణశాస్త్రి గారన్నట్టు అసలు నిసర్గైన తెలుగుకవి

'గాలి తాకనవే మూర్ఛనలు పోయే వరూధినీ విపంచికాతంత్రుల మేళవింపు లాంటి రసోద్వేగం ఒకటి -

గురువుల క్లిష్టంగా సంతరించుకొన్న ఉభయభాషావ్యుత్పన్నత చేత సుపరిష్కృతం అయిన శబ్దశక్తి రెండు -'

ఒక భావుకుని మాటల్లో చెప్పాలంటే ఇవి హనుమచ్ఛాస్త్రిగారి కవిత్వానిక జీవధర్మాలు

తెలుగు సామాజిక జీవనము -
నిండుగా ప్రవహించే తెలుగుదనము -
ఈరెండూ వారికవిత్వానికి నేస్తాలు -

సంప్రదాయ బంధురమైన వాక్కును అనుభూతితో సమన్వయించి తమకవితావాణిని వినిపిస్తారు- అందుకు నిదర్శనం. నేటి కీర్తితోరణ కావ్యం -

కీర్తితోరణ కావ్యం చరిత్రకు సంబంధించింది. తెలుగు సాహిత్యంలో వచ్చిన చారిత్రక కావ్యాలకన్నా భిన్నమైనది. ఏలనగ తించిన వైభవాన్ని అంతకు మును పటి కవులు ప్రశంసిస్తే, ప్రస్తుత కావ్యకర్త ఆవైభవానికి రూపకల్పన చేసి, జాతి నుద్దీపింప జేసి దృశ్యాలుగా తీర్చిదిద్ది మన కళ్ళెదుట పెట్టడం విశేషం -

కీర్తితోరణ కావ్యంలో కాకతీయ సంస్కృతిని తైలవర్ణ చిత్రాలుగా మంచి closeup లో 1 కవిత్వం 2 నాట్యం 3 శిల్పం మూడింటిని శిష్టంగా చూపడం జరిగింది

అక్కనబయ్యనలచే ఓడింపబడిన మనుమసిద్ధి పదవీచ్యుతుడై సింహపురి రాజ్యాన్ని కోల్పోతాడు ఆసందర్భాన మనుమసిద్ధికి ప్రధానమంత్రి యైన తిక్కన మహాకవి రాజ్యభ్రష్టుడైన తన రాజుకు తిరిగి రాజ్యం ప్రసాదించవలె ననెడి కోరికతో, కాకతీయ రాజ్యాధినేతయైన గణపతిదేవుని ఆశ్రయించడానికి ఓరుగల్లుకు ప్రయాణమై వెళ్తాడు గణపతిదేవుడు ససైన్యంగా నెల్లూరుసీమకు తరలి, సింహపురి రాజ్యంమీద దురాక్రమణ చేసిన, అక్కనబయ్యనలను ఓడించి ఆ రాజ్యాన్ని మనుమసిద్ధికి అందచేస్తాడు తిక్కన గారు ఓరుగల్లుకు వెళ్ళినపుడు తిక్కన గారి ఆగమన వృత్తాంతాన్ని విన్న గణపతిదేవుడు దర్శించిన తిక్కనార్యుని రూపవిది

'నిత్యపినాకినీ నియమాభిషేక ని
ర్మలదేహ యష్టిరంజిలెడువాడు
భస్మత్రి పుండ్రాంక ఫాలకుంకుమదీప్తి
ముక్కంటితో సరిపోలువాడు
ప్రాశిత వర పురోడాశ పవిత్ర వ
క్త్రాంబుజ వచన సౌరభమువాడు
హరిహరాత్మకము బ్రహ్మమ్ము నుద్వీక్షించి
ధన్యమ్ములైన నేత్రములవాడు
వేదకల్పమ్ము కొనకొమ్మ విరిసినట్టి
పువ్వుతళతళ గల చిరునవ్వువాడు
మహితసింహపురీ రాజమన్మసిద్ధి
యామాత్యకవిమంత్రివరుడు ప్రత్యక్షమయ్యె'

ఇవి అచ్చుకవిని గురించి కవి పలికిన మాటలు

పైపద్యాన్ని చదివినప్పుడు ఒక్కసారి తిక్కనగారి మూర్తి కళ్ళెదుట మెరుస్తుంది 'నిత్యపినాకినీ నియమాభిషేక నిర్మల దేహయష్టి రంజిలెడువాడు' అనుటలో తిక్కనగారి దీక్షాతత్పరతను 'వేదకల్పమ్ముకొన - కొమ్మ విరిసినట్టి పువ్వుతళతళ గల చిరునవ్వువాడు' అని భావించడంలో తిక్కనగారి అద్వైత తాత్త్విక కాంతిని కవిచిత్రించిన నేర్పు చూడదగ్గది భావంతోపాటు బలమైన భాష ఉన్నప్పుడే కవిత్వానికి దీప్తికలుగుతుంది

ఈ కావ్యంలో కవిత్వం తరువాత పేర్కొనదగిన అంశం నాట్యం. గణపతిదేవుడు గొప్పనాట్య కళాభిమాని అతని భావుకుడు జాయప్ప 'నృత్తరత్నావళి' అనే నాట్యగ్రంథాన్ని రచించాడు జాయప్ప గొప్ప యుద్ధవిద్యా విశారదుడే కాక, చక్కని నాట్యకళా కోవిదుడు కూడా తన ఆచార్యకంలో అద్భుత నర్తకీమణులను దిద్దితీర్చాడు అట్టివారిలో 'మధుమావతి' పేర్కొనదగినది.

గణపతిదేవుడు తిక్కనగారి కోరికపై సింహపురికి వెళ్ళి, అక్కన మాదన్నలను ఓడించి, మనుమసిద్ధిని తిరిగి సింహాసనా

ష్ఠితుని గావించి ఓరుగల్లుకు తిరిగివస్తాడు ఆ సందర్భాన జాయప్పసేనాని గణపతి దేవుని విజయోత్సవ సూచకంగా 'మధుమావతి' నృత్యప్రదర్శనను ఏర్పాటు చేస్తాడు మృదుమధురమైన వేణుగానాలతో, మృదంగధ్వనులతో ప్రారంభమైన మధుమావతి నాట్యము సభ్యులను ఆనందడోలికలలో ఓలలాడిస్తుంది.

'పాలపాల పారిజాతసుమల

పువ్వులు రాలినయట్లు, కప్రపుం

బలుకుల తావి, చల్వలను

పైకొనినట్టులు, వెన్నెలల్ సుధల్

వెలిచినయట్లు, వార్షికపు

వేళ మయూరము సర్వబర్హముల్

జలజలవిప్పి యాడినటు

చాన యొసంగెను నాట్యమాధురిన్

పారిజాత - పువ్వులు రాలిన యట్లు వెన్నెలఅమృతము కురిసినట్లు, వార్షికపు వేళలలో, మయూరం పురివిప్పారినట్లు మధుమావతి నాట్యం ఒప్పినది

కవిత్వనాట్యాల తరువాత పేర్కొనదగింది శిల్పం. కాకతీయ ప్రభువులు అన్ని కళలనూ బాగా పోషించినట్లే శిల్పాన్నికూడా పోషించారు ఈ శిల్ప విశ్వరూపం మనకు వేయి స్తంభాల మంటపంలో, స్వయంభూదేవాలయ శిథిలాలలో సాక్షాత్కరిస్తుంది ఆయా ఆలయాలలోని శిల్పనిర్మాణం రుద్రదేవుని కాలంలోనే జరిగిందని చరిత్ర వివరిస్తున్నది

రుద్రదేవుని ఆస్థానకవి అచితేంద్రుని ముఖంగా పలికిన శిల్పసౌందర్యం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

ఏమి స్తంభము లేమి పద్మములు ఏ

మేమి శిలాకల్పనా

సామీచీన్య విలాస శిల్పము! గవా

క్షప్రస్ఫురద్రూప శో

భామాధుర్యము! నృత్యభంగి విలస

ద్భామాభిరామప్రక

ర్షాముగ్ధత్వము! ఏమిలోకము! సుదీ

ర్ఘస్వప్న కైలాసమో!'

ఈవిధంగా కవిత్వం, నాట్యం, శిల్పం ప్రధానమైన అంశాలుగా కావ్యనిర్మాణం గావించిన ఇంద్రగంటివారు కావ్యంలోని శీర్షికలకు సైతం శిల్పమాహాత్మం చేసారు దినిలోకూడా కవి ఎంత నవ్యతను సాధించాడో అవగత మౌతుంది!

తెలుగుజాతిని గురించి, తెలుగుతనాన్ని గురించి ప్రస్తుతిస్తూ ఇంతకుముందు ఎంతో మంది కవులు ఎన్నోరకాలైన కావ్యాలు రచించారు కాని - కీర్తితోరణం తన విలక్షణత్వాన్ని తాను నిలుపుకొంది

తెలుగుజాతిమీద గల మమకారంతో కథాసంవిధానంలో,రచనలో, శిల్పంలో పాత్రలకు రూపకల్పన చేయడంలో, పాత్రలను రంగస్థలం మీదకు తీసుకొని రావడంలో కావ్యంలోని ఖండికలకు శీర్షికలను నిర్ణయించడంలో కవి అణువణువున తన ప్రతిభను వ్యక్తం చేశాడు

హనుమచ్ఛాస్త్రి గారి రచనలలో నాలుగే నాలుగు ప్రధానమైన గ్రంథాలు! 1 దక్షారామము 2 కాళిదాస కళామందిరము 3 సారమతి నన్నయ 4. కీర్తితోరణము అందులో 'దక్షారామము, కీర్తితోరణము' - రెండూ ఉత్తమ కావ్యాలు - 'కాళిదాస కళామందిరము - సారమతి నన్నయ విమర్శనాత్మక గ్రంథాలు-

అధునిక తెలుగు సాహిత్యంలోవచ్చిన 'గుర్జాక రాజశేఖర శతావధాని గారి' 'రాణా ప్రతాపసింహచరిత్ర' 'గడియారం వేంకట శేషశాస్త్రి గారి 'శివభారతము', మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి 'ఆంధ్రపురాణము' వంటి ఉత్తమకావ్యశ్రేణికి చెందుతుంది- ఇంద్రగంటి వారి కీర్తితోరణకావ్యంకూడా!

ఏనాడో ఒక ప్రాచీనకవి వ్రాసిన 'గువ్వల చెన్నశతకము' లోని

'గుడికూలును, నుయి పూడును

వడినీళ్ళను చెఱువు తెగును,వనములు ఖిలమౌ

చెడని ది పద్యం బొకటియె

కుడియెడమల కీర్తిగన్న గువ్వలచెన్నా!'

-అనే పద్యాన్ని దాశరథిగారు 'శిరః కంపము'లో పేర్కొన్నట్లు ఈ కవితా తోరణం ఏనాటికీ-పెడనిదీ-వాడనిదీ-అని పిస్తుంది

[ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1979-80 సంవత్సరమునకు కవిత్వానికి సంబంధించిన బహుమతి' కీర్తి తోరణము' కావ్యానికి యివ్వడం మిక్కిలి ముదావహం] *

-♦ చందాదారులకు ♦-

సమాలోచన సంవత్సర చందా 10/లు M O చేయుట ద్వారా-తప్ప ఇంకేవిధముగను చందాలు స్వీకరింపబడవు డూప్లికేటులోను, ట్రిప్లికేటులోను, రశీదులు పంపుటకాని, ప్రోఫార్మా ఇన్వాయిస్ పంపుటకాని, జరగదు చందా చేరిన తర్వాత వచ్చే సంచిక నుండి పంపగలమేకాని ప్రాత సంచికలు పంపజాలము.

వాపసు లేని పద్ధతిని ఏజన్సీలకు, 'సమాలోచన' 5 సంచికలకు తక్కువ కాకుండ ఆర్డరులకు 25/ కమీషను మినహాయించి M O ద్వారా పంపవలెను ఇంకేవిధముగను పంపజాలము — సంపా.

మాటలతో గీసిన మానవతా చిత్రాలు -

# బాపురెడ్డి గద్యకావ్యాలు

- శ్రీ కర్రా కార్తికేయశర్మ

కవిత్వం వ్రాయడమంటే ఎంతో తేలిక అనిపిస్తుంది కొందరికి. వారు కవిత్వాన్ని మంచినీళ్ళ ప్రాయంగా భావిస్తారు ఒక విధంగా నేటి 'కవిత్వరంగం' వారి అభిప్రాయాన్ని స్థిరపరచేదిగా కనిపిస్తోంది. జట్లుజట్లుగా కవులుచేరి 'కవితాసంకలనాలు' ప్రకటించడం, తెలుగురాయడం చదవడం వచ్చిన ప్రతిబుద్ధిమంతుడూ అడ్డంగానో, నిలువుగానో కొన్నిపదాలు అమర్చి కవిగా ప్రకటించుకోవడం ఆర్థికస్తోమత ఉంటే ప్రముఖుల పీఠికలు జతపరుస్తూ వాటిని అచ్చొత్తించడం ఇట్లా వెలుగులోకి వచ్చిన వందలకొలదీ సంపుటాలు తెలుగు కవిత్వరంగాన్ని కప్పెయ్యడం ఈవాస్తవాలను దర్శించిన ప్రతివాడికీ కవిత్వం అంగట్లో దొరికే బెల్లంలా కనుపించవచ్చు తప్పులేదు

కాని అందరికీలభ్యంకానిభావాలు కొందరిలో మెరుపుల్లా మెరుస్తాయి వాటిని అతడు కవిత్వంలో పదిలపరిచి, జనతకు అందిస్తాడు అతడికవిత్వం జనతలో పేరుకున్న జడత్వాన్ని పారద్రోలి చైతన్యం వికాసానికి తోడ్పడుతుంది. అలా నూతనత్వానికి నాంది పలికేదే కవిత్వం! ఎన్నో రాత్రులు ఆకవితా ప్రసవానికి నొప్పులు పడ్డ వాడే కవి!

శ్రీబాపురెడ్డికవి అంటేచాలదు,మంచి కవి. మంచికవి కవిత్వం మంచిగంధం వంటిది నిజాన్ని చూపే అద్దంవంటిది. అపరిమితాన్ని అప్రమాణిస్తూ, అనిజాలను దర్శించడం ఒక అనుభవం.

'సింహాచలంకొండ' అప్రక్కను
చల్లని పిల్లగాడుపులు వీస్తూ
ప్రక్కనున్న సాగరసంగీతంలో
పరవశమై తేలిపోయే
నిత్యనూతన సముల్లాసిని
విశాఖపట్నం సుహాసిని!'

ఈ ఆరుపాదాల్లోను విశాఖపట్నం బొమ్మగీసి చూపించారు బాపురెడ్డి నిజజీవితంలో రెడ్డ ఔదార్యవంతులైనా, కవిజీవితంలో మాత్రం 'పదాలపొదుపరి' అవసరాన్ని మించిన ఒక్కపదం వీరి కవిత్వంలో మనంఎక్కడో కాని చూడం తెలుగుకవితరంగంలో తిక్కన, వేమన, గురజాడ, శ్రీశ్రీ వీరే పదాలను పొదుపుగా వాడేరు వారితరువాత పదాల పొదుపులో బాపురెడ్డిని పేర్కొనవచ్చు

'విశాఖపట్నం జీవితం
విచిత్రంగా ఉంటుంది
అందమైన పరిసరాలు
అవసరమైన సరదాలు
అన్నీ ఉన్నాయిగాని -
పచ్చనోట్లు జేబులో ఉంటేనేకాని
పచ్చిమంచినీళ్ళుకూడా పుట్టవు ఇక్కడ!'

కవి సౌకర్యాన్ని వర్ణిస్తూనే, అసౌకర్యాన్ని కూడా వివరించాలి 'లోకంలో బాధలన్నవి లేవు అంత ఆనందమయమే!' అన్నా 'లోకంలో ఆనందం లేదు. అంతా బాధలనిలయమే!' అనినా ఆకవి సత్యవాది కాడన్నవిషయం స్పష్టమౌతుంది మరి సత్యాన్ని విస్మరించినకవి ఉదయించని రవివంటివాడు

విశాఖపట్నం సౌందర్యానికి తన్మయులైన బాపురెడ్డి అక్కడ ఉన్న 'ఇరుకు' తత్వానికి నిట్టూరుస్తున్నారు

'కూడు సమస్యకంటే ఇక్కడ
గూడు సమస్యే దొడ్డది
పెరిగిపోతున్న జనాభా తెచ్చిన
పెద్దసమస్యల్లో కల్లా పెద్దది!

అని బాపురెడ్డికలంలో పడి, కవితగా మారి ధన్యమైంది విశాఖపట్నం.

ఇక 'కుక్క'ను కావ్యవస్తువుగా తీసుకొని నవ్యతను సాధించారు కవి. ప్రతిరోజూ మనం 'ఛీ' కొడుతున్నా, 'జే' కొట్టవలసిన జంతువు కుక్క!

'నమ్మినవార్ని మోసగించడం
న్యాయం అయిపోయిన ఈరోజుల్లో
అన్యాయానికి
న్యాయం అర్పిస్తున్నావా?
అవిశ్వాసానికి
విశ్వాసం సమర్పిస్తున్నావా?
క్రూరమృగాలకు
చోరమృగాలకు
శత్రుడవు నీవు,
కృతఘ్న లోకానికి సైతం
కృతజ్ఞత చూపే
మిత్రుడవు నీవు!'

అంటూ కుక్కవిశ్వాసాన్ని శ్లాఘిస్తున్నారు 'కాదేదీ కవిత కనర్హం' నిజమే! కాని ఆ 'అనర్హత'ను అర్హతగా మార్చడంలో కవి శక్తిమంతుడు కావాలి! ఈఖండిక బాపురెడ్డిశక్తికి అద్దంపడుతోంది

'ఒకపుట' అనేకవిత అప్పటికప్పుడ చెప్పినదే అయినా 'త్వర'లేనికవిత

జననం ఒకపుట
'మరణం ఒకపుట
మానవజీవిత పత్రం అది'

'ఒకేపుటగల పత్రంలేదు
ఒకే తీరంగల నదిలేదు
ఒకటేఒకటి ఏదీ లేదు
సకలం ఆమ్రేడితం
దేవుడుకూడా ఒంటరికాడు
దేవీ సమేతుడు'

నిరాడంబరంగా ప్రారంభమై 'నగ్న సత్య'ప్రసవంతో హుంకారంగా పరిసమాప్తి కావడం ఈకవిత ప్రత్యేకత!

రసజ్ఞుడిగా విజ్ఞప్తి చేస్తున్నారు కవి.

'గాడిదమీద మూటలు మోయించినట్లు
కవితలో మాటలు మోయించకు
బాలపల్లవ కోమల వాగ్దేవిచే
బస్కీలు తీయించకు, కుస్తీలు పట్టించకు!'

ఈనాలుగు పాదాలలో బాపురెడ్డి కవిత్వ తత్వం మనకు బోధపడుతుంది. ఈనాటికవులందరికీ ఈపాదాలు శిరోధార్యాలు.

నల్లసిరా, తెల్లకాగితాలు పుష్కలంగా ఉన్నాయి, మెదడులో భావాలు, పదాలు సమృద్ధిగా ఉన్నాయి. ఏది రాసినా చదివేజనం సాహిత్యరంగంలో దండిగా ఉన్నారని కవిత్వం బళ్ళకెత్తిస్తే ఏం జరుగుతుందో గతకాలపు కవిత్వరంగాన్ని ప్రశ్నిస్తే - అది చెబుతుంది చేదైన సత్యాలను.

వందలకొలదీ కవులు కాలూనిన పూర్వాంధ్ర కవిత్వరంగంలో, నిలిచిన కవులు పదుల సంఖ్యలో మాత్రమే! మిగిలిన వారంతా కవితాధురంధరులే అయినా 'అనామకం' గా మిగిలిపోయారు. దానికి కారణం ఏమిటి? అంధానుకరణ, కృత్రిమ భాషాభేషజం, వెరసి పాషాణపాక కవిత్వం!

ఆధునిక కవిత్వంకూడా 'చరిత్ర పునరావృత్తం' అన్నట్లే ఉంది. వందల సంఖ్యనుండి వేలసంఖ్య వరకు కవులు పెరుగుతున్నారు. కావ్యాలు వస్తున్నాయి. ఎన్నికవితలు నిలుస్తున్నాయో? మరెన్ని గాలిలో తేలిపోతున్నాయో? పరిశీలించండి. గుండె గోదావరిలా ద్రవించిపోతుంది.

కవులెవరైనా ఈవిషయాన్ని గ్రహిస్తున్నారా? గ్రహిస్తే కవిత్వ తత్వం మారక్లేదేం? ఇంకా శ్రీశ్రీ పదచిత్రాలు యువకవుల కవితల్లో దర్శనమిస్తూనే ఉన్నాయి. సి. నారాయణరెడ్డి గొంతుక వందల యువగళాల్లో ప్రతిధ్వనిగా వినిపిస్తూనేఉంది. దాశరథి క్రోధం, యువకవుల క్రోధంగా కవితల్లో ప్రాకుతూనే ఉంది. ఆ ముద్ర 'టెక్నిక్' ఈనాటి కవుల్లో 'స్వతిన్నిక్'గా ప్రయోగిస్తూనే ఉంది. ఇంకా కుందుర్తి, కాళోజీ, నారాయణబాబు, కొంతవరకు శేషేంద్ర కవిత్వంలో కొందరిపై పెత్తనం చేస్తూనే ఉన్నారు. కవులు స్వతంత్రంగా, సొంత గొంతుకతో, తమవైన 'ముద్రల'తో ఎప్పుడు బయటకొస్తారు? ఎప్పుడు ఈకవిత్వం జీవనదిలా ప్రవహిస్తుంది? ఈప్రశ్నలకు కదిలేకాలమే జవాబు చెప్పాలి. ఒక్కటి మాత్రంనిజం. రాజకీయాలతో మనిషికి సన్నిహిత సంబంధమున్నా - ఆమనిషి కవిఅయితే వాటికి దూరంగా ఉండాలి. నిజజీవితంలో నినాదాలను ప్రేమించే వాడైనా, కవిజీవితంలో మాత్రం వాటిని బహిష్కరించాలి. అప్పుడు నిజమైనకవిత్వం, కొన్నికతాద్దాలు చూడగలిగే. కవిత్వం తప్పక వస్తుంది. అంతవరకూ బాపురెడ్డి అన్నట్లు.

'భావం అనే కల్లెం త్రెంపుకొని
పరుగెత్తే మాటల కవిత్వపు గుర్రం
కలిగించేది కాదు రసానుభూతి
కళ్ళూ ఒళ్ళూ మండించు
ధూళి ధూసర విభూతి'

'అంతరిక్షపర్వం' ఒకచక్కని కవిత. బాపురెడ్డి హృదయకేదారంలో పండిన పచ్చని మమత.

'పందొమ్మిది వందల అరవై తొమ్మిది
జూలై ఇరువై ఒక్కటినాడు
ప్రాణికోటి చరిత్రలో
ప్రప్రథమంగా మానవుడు
పాదం మోపినాడు
చంద్రలోకం మీద-'

అంటూ మానవ విజయాన్ని అభినందిస్తూనే, నరలోకంలోని మూఢాచారులకు భరతవాక్యం పలకా అని, అలాజరిగిన నాడే ఏవిజయానికైనా చరితార్థత ఏర్పడుతుం దని-లేకుంటే

'చేతులు జనరక్తంలో తడిపి
కాళ్ళు చంద్ర లోకం మీద పెడితే
అస్పృశ్య గ్రహాలను స్పృశించి
అస్పృశ్యు లని అనాథలను
బహిష్కరిస్తే
చర్విత చర్వణమే అవుతుంది
మానవ చరిత్ర,

అని ఈకవితలో తన పదునైన భావనను వ్యక్తపరిచారు. ఆర్మ్‌స్ట్రాంగ్' కూడా ఈసత్యానికి తలవంచాలి తప్పదు.

'ఎకనామిక్స్ సుందరి' అనే కవిత బాపురెడ్డి మాత్రమే చేయతగ్గ కవిత. ఉస్మానియా యూనివర్సిటీలో యం. ఏ.

కనామిక్స్ విద్యనభ్యసించే రోజుల్లోనే రెడ్డి హృదయంలో ఈ సుందరి చోటు చేసుకొని ఉండవచ్చు. శ్రీ బోయిభీమన్న అన్నట్లు 'సకల సౌందర్యాలకూ, సమస్త సుందరిమణులకు రాగాలకూ భోగాలకూ సంగమస్థానం' ఈ ఎకనామిక్స్ సుందరి

'వసంతాన్ని
ఓయూనిట్ గా తీసుకున్నా-
ప్రేయసీ!
నేను చేస్తున్న
నీ అధర సుధాకన్ జంప్షన్
లాఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకే
ఓ ఎక్సెప్షన్,'

అంటూ ప్రారంభమై 'మార్జినల్ యుటిలిటీ' మరీదాటిపోతే 'మైనస్ యుటిలిటీ' మీదపడుతుందని స్పష్టంగా కవితను ముగించడం జరిగింది అర్థికశాస్త్రాన్ని కూడా అందంగా, సుందరి రూపంగా భావించి కవిత చెప్పిన ఘనత బాపురెడ్డికి దక్కింది.

బాపురెడ్డి విదేశయాత్రానుభూతులు చక్కనివి చిక్కనివి. ఆ కవితలు పఠిస్తుంటే - ఆ ప్రాంతాలలో మనం విహరించినట్లుంటుంది. 'ఏథెన్సులో ఆరంభించి, మాస్కోలో ముగించాను అనుకున్నాను' అంటూ అన్నంతపనీ చేశారు

'ఏథెన్సులో అరుణోదయం'-

'అక్షరాల కందని అందంతో
సూర్యబింబం ఉదయించింది

'పూలబాల హాలండ్'-

'పూలు చూడాలంటే
హాలండ్ చూడాలంటే
యూరోపా చూడాలి,

'చేపకళ్ళల స్కాండినేవియా'-

స్కాండినేవియాను చూచి
స్పందించనివాడుండడు
అక్కడ కవిత్వం రాయలేనివాడు
ఎక్కడా కవి కాలేడు'

'లండన్ దీపం'-

'షేక్స్పియర్, షెల్లీ, కీట్సు
వర్డ్స్వర్త్, గోల్డుస్మిత్, బైరన్
జాన్సన్, బర్నార్డ్ షావంటి
సాహితీ స్రవంతులు
తత్త్వ చింతనా సాగరులు
వెలసిన ఇంగ్లండు ద్వీపం
చరిత్రలో ఆరని దీపం'

'ప్యారిస్ మయూరి'-

'చక్కని చిలకలాగ
చక్కెర బొమ్మలాగ
ఎటుపోయినా హాయిగా
ఏది చూసినా తీయగా
ఉంది అందాల ప్యారిస్ నగరం
రెండు కళ్ళున్న వాళ్ళకి దేవుడిచ్చిన వరం'

'కన్నీటిలో వాటర్లూ'-

'బెల్జియంలో చూడదగ్గది
వాటర్లూ ఒక్కటే
ఆ ఒక్కటి చూడడానికైనా
ఆదేశం పోయి రావాలి

'ధర్మవేణి జర్మనీ'-

'నిర్మూలన పథాన్ని గతాన్ని వదలి
నిర్మాణ పథాల భావిరథాల కదలి
చేతనా కేతనాలు ఎగరవేసే
జీవకళా విలాసిని
జర్మనీ ధర్మవేణి నేడు'

'స్వేదం మోదం కలసిన చెకొస్లొవేకియా'-

'పొట్టనిండా తిండాలి అంటే
పుష్కలంగా తాగాలి అంటే
అధరణాలు అలంకారాలు లేని
అచ్చమైన అందాలు చూడాలంటే
నావంటి పేదవాళ్ళకు
నాకం చెకొస్లొవేకియా

'భూలోకసుందరి స్విట్జర్లాండ్'-

'జలకమాడే మేటికొలనుల
అందాలు ఆరబోసిన
సుందరభూమి స్విట్జర్లాండ్'

'కాలకేళీ రంగం రోంనగరం'-

'రోం నగర చరిత్రాస్మృతి
రోమాంచం కల్గిస్తుంది
ప్రతిశిథిల శిల్ప సౌందర్యరేఖ
ఏదో మహాకావ్యం విన్పిస్తుంది'

ఈ విధంగా తన విదేశయాత్రానుభవాలను అక్షరాలలో అందంగా, కావ్యాత్మకంగా పొందుపరిచారు బాపురెడ్డి విదేశాలలో పర్యటించే అవకాశం, అదృష్టం అందరికీ కలగదు కలిగినా ఆ అనుభవాలను అందమైన కవిత్వాలుగా మార్చే శక్తి అందరికీ ఉండదు బాపురెడ్డి అద్భుతమైన కల్పనాశక్తి గల కమ్మని కవి ఈ జాన చేసిన విదేశయాత్ర, సుందర కవిత్వ పాత్ర!

అన్ని దేశాలు సంచరించినా పల్లెటూరిని, ప్రాణేశ్వరిని మరచిపోలేదు కవి

'మళ్ళీ మా పల్లెటూరు చేరుకున్నాను
పల్లెటూరిలో నాకోసం పదినెలలు
పల్లేరుకాయల పరుపుమీద
వలపు మల్లెల దండ అల్లుకొన్న
ప్రాణేశ్వరి పరిష్వంగంలో
వ్రాలిపోయేను'

అంటారు ఈ పాదాల గర్భంలో ఎంత తృప్తి దాగుంది!

అంబేద్కర్ దళితజాతులకు ఆశాజ్యోతి భారత రాజ్యాంగ నిర్మాత- మేధావి ఆయన వ్యక్తి కాదు వ్యవస్థ, సమిష్టి, సామూహిక శక్తి. ఆయన మేధస్సు సాగరంతో సరిపోల్చ తగ్గది. ఆయన జీవితం దేశప్రగతికి అంకితమైనట్టిది. అట్టి మనీషిని 'అంబేద్కరుం శరణం గచ్ఛామి' అంటూ కవితతో స్మరిస్తున్నారు బాపురెడ్డి.

'చైతన్య మహానగిపై
భరతఖండం నిండా ఆవరించిన నీవు
శిలవై పోయావా!'

అని ఆయన మృతికి పరితపిస్తూనే 'మళ్ళీ ఒక్కసారి అవతరించు అంబేద్కర్' అంటూ ఆయన పట్ల తనకున్న భక్తిని ప్రస్ఫుటం చేశారు. బాపురెడ్డివంటి మానవతావాది ఈమాటలు అనగలరు ఆమాటల వెనుక అంబేద్కర్ కృషి ఈసమాజానికి మరింత అవసరమన్న 'ధ్వని' వినబడుతోంది.

ఈమధ్యకాలంలో ఈ కవిత ఎంత ప్రచారాన్ని పొందిందో వివరిస్తాను.

సాధారణంగా తెలుగు కవిత్వంలో క్రొత్తప్రయోజనం బయలు దేరిందంటే 'సినిమావిడుదల' రోజున క్రిక్కిరిసిన జనంలా కవులు పోటీలుపడటం మనం ఎరుగున్న సత్యమే! 'మళ్ళీ ఒక్కసారి అవతరించు అంబేద్కర్' ఇవిస్థూలదృష్టికి సామాన్యమైన మాటల్లా కనబడ్డా-ఈమాటల్ని కవులెందరో సొంతం చేసుకున్నారు.

మళ్ళీ ఒక్కసారి అవతరించ గలవా గురజాడ!' అని ఒకకవి

'మళ్ళీఒక్కసారి అవతరించుబాపూ!' అని ఇంకొక కవి ప్రతిభనుబట్టి బాపురెడ్డి వాక్యాన్ని వినియోగించు కోవడం జరిగింది పదిమంది కవులను తన ప్రయోగాల చుట్టూ త్రిప్పుకొనే కవి సామాన్యుడా ? అఖండుడు. బాపురెడ్డి కవిత్వం అఖండం!

ఆర్ద్రిత ఆవేదన
మమత సమత
మానవత్వం నూతనత్వం

బాపురెడ్డి కవిత్వానికి ఆభరణాలు!
ఆ ఆభరణాలను దాల్చిన మానవతా చిత్రాలే ఈ గద్యకావ్యాలు!




నేటి కలలో రేపటిమనిషి

[రేపటిమనిషి - వచనకవితాసంపుటి. గ్రంథకర్త టి గౌరీశంకర్ 1/8 డెమ్మీ 80 పుటలు వెల మూడురూపాయలు మాత్రం. ప్రతులకు రచయిత పేర - ఇంటినెంబరు 1-8-78/79 చిక్కడపల్లి హైదరాబాద్ 20 కి రాస్తే పొందగలరు ]

1970 జనవరి నుంచి '76 మార్చి వరకూ భిన్న భిన్న మానవికావస్థలలో రచించిన కవితలనుంచి 43 రచనలను ఎన్నిక చేసిన సంపుటిగా శ్రీ టి గౌరీశంకర్- 'రేపటిమనిషి' అనే శీర్షికతో ప్రచురించారు 'People ask for criticism, but they only want praise' అంటాడు సోమర్ సెట్ మామ్ ఈమిత్రుడు 'మీఅభిప్రాయం నిర్మొహమాటంగా తెలపండి' అని కోరుతూ పుస్తకం పంపినపుడు నానుంచి స్తుతిమాత్రమే కోరుతున్నాడని నేనను కోవడంలేదు. విమర్శకోరేవారిలో ఉండే కాఠిన్యం ఈ యువకవికి అంటకట్టడం లేదు

ఆధునిక యుగంలో ఏ గ్రంథమైనా ఎదురుకాగానే చూపుల నాకర్షించేది ముఖచిత్రమే శ్రీ శీలావీర్రాజు ఈ రేపటి మనిషికి కల్పించిన రూపం బహుశా అతని దర్శనకు కారణమేమో! విష మాత్రులూ, విషదంష్ట్రలూ, నిష్క్రియాపరదీర్ఘహస్తాలూ, అర్థరహిత వర్ణ సంకీర్ణతా వృత్తం మీద జాగుతున్నవ హంగా దర్శన మిస్తోంది. రేపటిమనిషిని గురించి కవితోసహా మనమంతా పెంచుకుంటున్న మధురోహలకిది వికృతరూపం తప్ప అన్యంకాగు 'రేపటిమనిషి యథార్థరూపం ఇదే నని దార్శనికులంతా అంగీకరిస్తే ఈమానవలోకాన్ని ఇక్కడే సమాప్తంచేయడం మంచిది ఫాసిస్టుల వాంఛితాలే సఫలతనొందక తప్పదు మోడరన్ ఆర్టు అనుకొని సిగ్గులో తల వాల్చుకొనేటట్లు చేస్తున్నాడు పోనీ యిది నైరూప్యకళ (ABSTRACT ART) అనుకుందామా అంటే ఏ ఇంప్రెషనూ కలిగించని శరీరావయవాల ప్రతీకలు ఎందుకు పోగులు పెట్టినట్లు ? ఇలాంటి చిత్రాలు ఎవరు చిత్రించినా, ఎందుకు చిత్రించినా జాతి ఆదర్శాలను అపహాస్యం చేయడమే కాగలదు

శ్రీ గౌరీశంకర్ ఎన్నిక చేసిన కవితలలో వర్తమాన దుర్వ్యవస్థపై ఆక్రోశం ఉంది ధనస్వామ్యవ్యవస్థ మారాలనీ, భవిష్యత్తులోనైనా సమధర్మం ఏర్పడాలనీ ఆకాంక్షఉంది. కాని కవితాశిల్ప రహస్యాలుఅభ్యస్తంకాలేదు కవితలలో అధికసంఖ్యాకాలు ప్రథమికావస్థలోనే

కొట్టుమిట్లాడుతున్నాయి. ప్రతికవిత లోనూ ఉత్త ఉద్ఘాటన దర్శనమిస్తుంది అర్థవిగిహిత పదవిన్యాసం ఆక్రమించింది కవితానుభవపారమ్యాన్ని పాఠక హృదయంలో నిక్షేపించలేక పోతున్నాయి పరిపక్వత వైపునా కవిచేసే ప్రయత్నమే అభివ్యక్తమైంది నినాదాలబోర్డులు కవిత్వంకానట్లే - ఆధునిక స్పృహ కల పదాలయాసంచయమూ కవిత్వం కాదు. దైనికజీవితం జంజాటంలోపడి విస్మరణీయమవుతున్న సంఘటలను కవితాకళ చిరస్మరణీయం చేయాలి పాఠకహృదయం కవిత్వానుభూతితో రంజితమవాలి శాశ్వతసౌందర్యాన్ని పట్టి నిలుపుకోగల పనిముట్లు పదచిత్రాలు అభివ్యక్తి మూర్తులు. ఇట్టివి సర్వాంగసుశోభితంగా తనరారినపుడే ఒకవాక్యం కవితారామణీయకత నందుకుంటుంది. ఆ ప్రాథమిక చికిత్స ఇంకా ఈరచయితకు అలవడ లేదు. ఆరేళ్ళలో రచించినా ఈకవితలను ఈరూపంగా గ్రంథస్థంచేయడం తొందరపాటే! అవధారణలు ఉత్తమ కృషి ఫలితాలనే ప్రదర్శించి వుంటే ఆదరం లభించేది

తన్ను అడుగడుక్కీ ప్రోత్సహించిన శ్రీ కుందుర్తికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాడీరచయిత. మంచి కవిత్వమంటే ఏదో తెలిసిన శ్రీకుందుర్తి - ఈ వర్ధమాన రచయిత ప్రదర్శించే పేలవమైన వాక్యాలను పరిహరించి మేలు చేయవలసింది. ఇదీ వచనకవిత్వమే కదా, ఇతడూ మనఫ్రీ వెర్సుఫ్రంట్ లోవాడే కదా అని ఉదాసీనత వహిస్తే- అతి సేంచేస్తాను పాపం పక్కవ్యూహాలి పిందెలనే పీకివెట్టాడు మార్గదర్శకులైన కవులు అనుజన్ములయిన సాధకులకు చిత్తశుద్ధితో మేలుకీళ్ల వేర్పాటు చూపకపోవడంలో న్యాయం లేదు సాహిత్యేతరమైన అభిమాన దురభిమానాలకు అవకాశం కల్పించడం యువరచయితలకు మేలు కాదు. నిష్ణాతులు ప్రారంభకులకు చక్కని మార్గదర్శకసూత్రాలు తెల్పకపోతే- కీర్తిమంతుల నిష్ణాతృత్వమే సందేహాస్పదమవుతుంది. మంచీచెడ్డా తెల్పకుండానే ఒకరచయితను ప్రోత్సహించడమంటే- అతనికి అనవసర భ్రాంతులు కలిగించి, నష్టంచేయడమే డాక్టర్ నారాయణరెడ్డి 'ఉన్నదేచెబుతున్నా'నంటూ రెండు పుటలురాసి, ఏమీచెప్ప నేలేకపోవడం- గౌరీశంకర్ కు ఏవిధమైన కితాబో!

ఈరేపటి - మనిషి లోని ఏమూడో నాలుగో తప్పించి మిగిలిన రచనలన్నీ కవితలనేపదానికి చేరువగానైనా రాలేదు 'ధర్మ్యహర్మ్యగవాక్షానికి కట్టిన అక్షరతోరణాలు' అని నారాయణరెడ్డి భావాన్నే పునరుక్తం చేశాడు. 'పట్టుబడిన చేపలా, చుట్టబడిన పీతలా' అనే పదవిన్యాసంలో గుండెను పట్టుకోగల మంచి పదచిత్రం ప్రాసకోసం అపభ్రంశమైంది 15వ పుటలో 'చైతన్యంలోనే కవిత్వం పుడుతుంది - కవిత్వం లోనే చైతన్యం జీవిస్తుంది' అనే వాక్యాల పేర్పులో కవితాచైతన్యం విస్మృతమవుతోంది. 'మాంద్యం'- మాంధ్యంగా మారినంత మాత్రంలో మరింత శక్తిమంతం కాబోదు!

'చైతన్యం ప్రసాదించే సూర్యుడు మావైతాళికుడు' అనే పదచిత్రంలోకవితా రశ్మి తగుల్తుంది ఉద్ఘాటనాట్టహాసాలు మితిమీరి కవితో త్రుల్ని కట్టడి చేస్తున్నాయి పొగుడబడినామూ సంయమనమూ పాటించబడితే ఎంతోహృద్యంగా ఉండేదీకవిత! వీరికోటమాలి, కవిత్వస్థాయి కెదిగిన చక్కనిరచన. కఠిన-కటిక వంటి బ్రాకెట్ల అటలు, కవిశైశవావస్థకు గుర్తులు ప్రభుత్వప్రచారంగాఢ్ళ అపభ్రంశంచేసే 'అధికదిగుబడి' వంటి దుష్ట సమాసాలు సాధనలోఉన్న కవులు చేయకపోవడమే మంచిది. కవులు చేస్తే చేతగానితనంగా తేలిపోతాయి అభినవముక్కంటి అనడం- అభినవత్రినేత్రుడనడంకన్న ఏవిధంగా అందాన్ని ఆర్జించుకోగలిగింది? (పు 87). బ్రాందీ సీసాల విలువ పెరిగింది (పు 41) అనే వాక్యంవల్ల- బ్రాందీసీసాలు తగినంత చౌక కాలేదే అనేబాధ వ్యక్తమవుతోంది!

ఇలా ప్రాథమికదోషాలు ఎత్తిచూపడం భవిష్యత్తులోనైనా ఇలాంటి రచయితల ఉత్తమ కవితారచనకు మార్గదర్శమవుతుందనే ఆశతోనే! 'అంతా బాగుంది, ఓహో, భేష్!' వంటి ప్రోత్సాహవచనాలు వినడానికి తీయగానే ఉంటాయి. కాని కవిత్వం ఒకదీర్ఘయాత్ర యిలాంటి పసలేని ప్రోత్సాహాల వ ఏమీ ప్రాప్తించవు. వర్ధమానరచయిత ప్రవర్ధమానతనుకోరినపుడేయువతరంల ఉత్తమకవుల రూపురేఖలు బయల్పడగలవు. ఆశుభాశంసతోనే యిదంతా

- శ్రీ సోమసుంద

# ఉద్గ్రంథములు

1) నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) రు 50—00
2) నిర్వచన అధ్యాత్మ రామాయణము రు. 20—00
3) నిర్వచన మహాభాగవతము రు. 30—00
4) శ్రీ వేంకటేశ్వర విజయము రు 25—00
5) కుందమాల నాటకము రు. 5—00
6) వేణీసంహార నాటకము రు. 5—00
7) శ్రీ వాల్మీకి రామాయణము మొదటి సంపుటము రు. 8—00

కృతికర్త ప్రకాశకుడు

**బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఎ.**

8-22-14, గాంధీనగర్, కాకినాడ-4.

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము గ్రంథవిమర్శకు ప్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలుపంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంత వఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు —

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1